27.1.1995 శుక్రవారం, 12 పేజీలు, సంపుటి : 67, సంచిక : 4, విడిప్రతి : రు. 2.00 లు

Phone : 27354. Regd No. HNL 1

# జమీన్ రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు

జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి



త్వరలో రాజీనామాకు నిర్ణయం

# అర్జున్‌తో చెన్నా దోస్తీ?

ప్రధాని పై తిరుగుబాటు ప్రకటించి, కాంగ్రెస్ నుంచి సస్పెండైన మాజీ కేంద్ర మంత్రి శ్రీ అర్జున్ సింగ్‌తో తమిళనాడు గవర్నర్ డాక్టర్ మర్రి చెన్నారెడ్డి చెలిమి కలపడం రాష్ట్ర కాంగ్రెస్‌లో సంచలనం సృష్టిస్తున్నది. చెన్నారెడ్డి గారు చాలా కాలం నుంచి ప్రధాని పై అసంతృప్తితో వున్నారు. ఆంధ్రప్రదేశ్ రాజకీయాలలో తనకు, తన కుమారుడు మర్రి శశిధర్ రెడ్డికి సరైన ప్రాధాన్యత, ప్రాతినిధ్యం ఇవ్వటం లేదన్నది ఈ అసంతృప్తికి ఒక కారణమైతే, తమిళనాడు ముఖ్యమంత్రి జయలలితతో తన కేర్పడిన కక్షను తీర్పుకో నివ్వకుండా ప్రధాని అడ్డు పడుతున్నారన్నది ఆ అలుకకు మరొక కారణం. ఎందువల్లనో చెన్నారెడ్డి గారు మద్రాసుకు వెళ్ళిన దగ్గర నుంచి జయలలితతో ఏదో ఒక పేచీ పెట్టుకుంటూనే వున్నారు. ఆపా మాపీగా, అభిప్రాయ బేధాలుగా మొదలైనది కాస్త, ఇద్దరి మధ్య మాటలు లేనంత దూరం విస్తరించింది. ప్రభుత్వ కార్యక్రమాలకు గవర్నర్‌కు ఆహ్వానం కూడా పంపడం లేదు. సాంప్రదాయంగా జరిగే రిపబ్లిక్‌డే వంటి ఉత్సవాలలోనూ గవర్నర్‌ను మినహాయిం చేస్తున్నారు. చెన్నారెడ్డి గారు కూడా రాజప్రతినిధిగా కాక, కాంగ్రెస్ పార్టీ నాయకుడుగానే వ్యవహరిస్తున్నారు. స్థానిక కాంగ్రెస్ వాదులతో చేరి జయలలిత ప్రభుత్వాన్ని డిస్మిస్ చేయమని ప్రధాని పై ఒత్తిడి తెచ్చారు. ఇటీవల జరిగిన ప్రపంచ తమిళ మహాసభలకు ప్రధాని, రాష్ట్రపతి రాకూడదని నివేదికలు పంపి, అభ్యర్థనలు చేసి మరింత వివాదాస్పదులైనారు. కానీ ప్రధాని శ్రీ పి.వి. నరసింహా రావు చెన్నారెడ్డి చెప్పే ఏ మాటా విన్పించు కోలేదు. అట్లని జయలలిత కోరినట్లు చెన్నారెడ్డిని మద్రాసు నుంచి పంపించనూ లేదు. తన కలవాటైన నాన్పుడు ధోరణిలో వీరిద్దరి పోరును చూస్తూ వూరకుండి పోయారు. ఈ అనిర్ణయ వైఖరి, ఈ నిర్లక్ష్యమే చెన్నారెడ్డికి చిరాకెత్తిస్తున్నాయి. ప్రధాని పై ఆయన మండి పడుతున్నారు. ఇంకొక ప్రక్క వయస్సు పెరిగినా, అనారోగ్యం పై బడినా చెన్నారెడ్డిలో మానసిక యవ్వనం, రాజకీయోత్సాహం తరగలేదు. చురుకుగా, చలాకీగా వ్యవహరించాల్సిన తనకు రాజ్‌భవన్ బంగారు పంజరమే వంటిదని ఆయన భావన. ఆ బంధనాలను త్రెంచుకొని త్వరగా బయట పడాలన్నది ఆయన ఆరాటం. అందుకు అవకాశం కోసం చాలా కాలం నుంచి ఎదురు చూస్తుండినాడు. అర్జున్ సింగ్ తిరుగుబాటు, ప్రధాని పివి రాజకీయంగా బలహీన పడడం ఆయనకు దేముడిచ్చిన వరాలుగా వుపకరించాయి.

అర్జున్ సింగ్‌తో కలిసి దేశ వ్యాప్తంగా సీనియర్ కాంగ్రెస్ వాదులను ఒకటిగాకలిపి జాతీయ రాజకీయాలలో ప్రత్యక్షంగా పాలు పంచు కోవాలనేది చెన్నారెడ్డి అభిమతం. రేపు ఐదు రాష్ట్రాలలో జరుగనున్న అసెంబ్లీ ఎన్నికల తర్వాత పివి ఆ పదవిలో కొనసాగలేడని, కాంగ్రెస్ సంక్షోభంలో పడినప్పుడు తాను జాతీయ నాయకుడుగా ఎదగ వచ్చునని ఆయన ఆశ. ఈ ఉద్దేశ్యంతోనే ఆయన అర్జున్‌సింగ్‌కు రాజ్‌భవన్‌లో విందు ఏర్పాటు చేశారు. రహస్య మంతనా లాడారు.

ఆంధ్రప్రదేశ్‌లో చెన్నారెడ్డి తప్ప మరే ముఖ్యమైన నాయకుడూ అర్జున్‌సింగ్‌ను బలపరచడం లేదు. కోట్ల విజయభాస్కర రెడ్డి, నేదురుమల్లి జనార్దన రెడ్డి, వై.ఎస్. రాజశేఖర

6వ 10 పేజీలో




# ఖాళీ ఖజానా, కుటుంబ కలహాలు ఎన్టీఆర్‌ను వేధిస్తున్నాయి!

సబ్సిడీ బియ్యం, మద్య నిషేధం వంటి నిర్ణయాలు; ఉద్యోగులతో సామరస్య వైఖరి, అక్కినేని వంటి పాత శత్రువులతో స్నేహితం, పారిశ్రామిక వేత్తలకు సహకారపు హామి వంటివి తెలుగుదేశం ప్రభుత్వ ప్రతిష్ట పెంచుతున్నా ముఖ్యమంత్రి ఎన్‌టి రామారావు మనః శాంతితో బ్రతక లేక పోతున్నారు. సుదురుగా పరిపాలన సాగించ లేకున్నారు.

ముద్దుల భార్య, ఇద్దరల్లుళ్ల మధ్య రోజు రోజుకీ పెరిగి పోతున్న కలహాలు ఒక ప్రక్క; పట్టి పోయిన ఆవు వలె తయారౌతున్న రాష్ట్ర ఖజానా ఇంకొక ప్రక్క ఎన్‌టి రామారావు గారిని ఇబ్బంది పెట్టేస్తున్నాయి. లక్ష్మీపార్వతి గారు ఏ మాత్రం వెనక్కు తగ్గడం లేదు. నిత్య పరిపాలనా వ్యవహారాలలో ఆమె జోక్యంతో పాటు తన మాటె చలామణి కావాలన్న పట్టుదల పెరిగిపోతున్నది. అధికారులు, మంత్రులు తననే కలవాలని శాసిస్తున్నారామె. కలవని వారిని సాధిస్తున్నారు. ఈ మితి మీరిన జోక్యం పై అల్లుళ్ల నిరసన కూడా ఎక్కువైంది. వారికి మద్దతుగా ఎన్టీఆర్ సంతాన మంతా ఏకమైనారు. కూతుళ్లతో పాటు, ఎప్పుడూ రాజకీయ జోక్యం ఎరుగని జయకృష్ణ వంటి వారూ అప్పుడు ఎన్టీఆర్‌ను నిలదీస్తున్నారు. అలుకలు, ఆగ్రహాలు, అసంతృప్తులతో నిద్ర పట్టకుండా చేస్తున్నారు. పరిస్థితి ఇట్నే కొనసాగితే ఎన్టీఆర్ తనకు కొత్త భార్య కావాలో, పాత భార్య సంతానం కావాలో తేల్చుకోవాల్సిన స్థితికి

## మతిమరపు మరీ పెద్ద బాధగా వుంది

విషమించేట్లుంది. ఎక్కలి విషయంలో ఈ పట్టుదలలు మరీ జాస్తిగా వున్నాయి. తాను పోటీ చేసి తీరాలని లక్ష్మీపార్వతి పంతం; చేయరాదని సంతానం మద్దతు పట్టుదల.

ఇంకొక ప్రక్క ఖజానా పరిస్థితి ఆందోళనకరంగా వుంది. చిల్లి గవ్వ లేదు. అప్పటికే అన్ని ఖర్చులూ నిల్పి వేశారు. ఉద్యోగుల జీతాలు తప్ప మరే వ్యయం కూడదని ఆదేశాలు జారీ చేశారు. నీటి పారుదలు, పంచాయితీ

6వ 10 పేజీలో

# ఆర్థిక సంస్కరణలతో పేదవాడు కృంగిపోయాడు!

డాక్టర్ మన్మోహన్ సింగ్ ప్రారంభించిన ఆర్థిక సంస్కరణల వల్ల ధనిక, పేద తారతమ్యం క్రమంగా పెరిగి పోతున్నది. ప్రభుత్వం అందజేసే లెక్కపక్కల ఆధారంగానే జరిపిన నేషనల్ శాంపుల్ సర్వే అధ్యయనంలో ఈ కఠిన వాస్తవం రుజువైంది. జాతీయ సంపదలో పై స్థాయిలో వున్న 20 శాతం మంది సంపన్నులు 40.14 శాతం సంపదను అనుభవిస్తుంటే, క్రింది తరగతికి చెందిన 20 శాతం మంది పేదలు కేవలం 8.99 శాతం భాగాన్ని మాత్రమే పొంద గల్గుతున్నారు. అందరికీ చెందవలసిన జాతీయ సంపదను పేదల కంటే సంపన్నులు నాలుగున్నర రెట్లు అధికంగా అనుభవిస్తున్నారు. అంటే పేద వాడు ఒక్క రూపాయి వినియోగించు కుంటే, సంపన్నులు నాలుగున్నర రూపాయలు తీసుకొంటున్నారు. ఆర్థిక సంస్కరణలకు ముందు పేదలకు 9.13 శాతం జాతీయ సంపద అందుబాటులో వుండేది. కాని పివి నరసింహా రావు గారు ప్రధాని అయిన తొలి 18 నెలల్లోనే అది 8.99 శాతానికి దిగజారింది. ఇప్పటి లెక్కల ప్రకారం ఈ అసమతౌల్యం మరీ అధికంగా వుంది. శ్రీలంక, బంగ్లాదేశ్‌ల కంటే కూడా ఎక్కువగా మన దేశంలో ధనిక పేద తారతమ్యం పెరిగి పోతున్నదని అంచనా.

ధరలు, మరీ ముఖ్యంగా ఆహార ధాన్యాలు, ఉత్పత్తులు ధరలు పెరగడమే దీనికి కారణం. ఆర్థిక సంస్కరణల తర్వాత దేశంలో ఆహార ధాన్యాల అదుపు తప్పి పోయాయి. ధాన్యం, గోధుమల మద్దతు ధరను కేంద్ర ప్రభుత్వం పెంచడం దీనికొక కారణం.

### రిలయన్స్ రాజకీయ ప్రాభవానికి మరో ఉదాహరణ

సైకిల్ పై తిరిగే నూలు మిల్లు వ్యాపారస్తుడి స్థాయి నుంచి, దేశంలోకెల్లా పెద్ద పారిశ్రామిక సంస్థ నిర్వాహకుడిగా ఎదిగిన రిలయన్స్ ఇండస్ట్రీస్ అధినేత అంబానీకి రాజకీయాధికారాన్ని తన కంపెనీ ప్రగతికి ఎట్లా వాడుకోవాలో కొట్టిన పిండి. గత ఇరవయ్యేళ్లలో ఆయన కంపెనీ పలె ప్రభుత్వ విధానాలను తమ కనుకూలంగా మార్చించుకొని లాభాలు గడించిన సంస్థ మరొకటి లేదు. ఆర్థిక సంస్కరణలు, స్వేచ్ఛాయుత వ్యాపార వాతావరణంలో సైతం రాజకీయ పలుకుబడి నుపయోగించి ఎట్లా ప్రయోజనాలు సాధించవచ్చో నిరూపించి చూపాడు అంబానీ.

**గత నాలుగేళ్లలో సంపన్నులు మరింత ఆర్జిస్తే పేదవాడు మరింత దిగజారిపోయాడు!**

కంపెనీలు విడుదల చేసే పబ్లిక్ ఇష్యూ షేర్ల విషయంలో సాధారణంగా వస్తువుల ఉత్పత్తి, తయారీలు వుండే పరిశ్రమలకు సంబంధించి మాత్రమే ఎన్ఆర్ఐలు పూర్తి మొత్తం తిరిగి తమ దేశానికి తీసుక వెళ్లే ( రిపాట్రియేషన్) వసతి కల్పిస్తారు. అంబానీ ఇటీవల విడుదల చేసిన రిలయన్స్ క్యాపిటల్ అండ్ ఫైనాన్స్ ట్రస్ట్ లిమిటెడ్ కంపెనీకి ఈ పద్ధతిలో ఎన్ఆర్ఐలకు షేర్లు అమ్మే వసతి కల్పించింది రిజర్వు బ్యాంకు. ఇది పూర్తిగా చట్ట విరుద్ధం. ఈ కంపెనీకి ఎటువంటి వస్తూత్పత్తి కార్యక్రమం లేదు; అది పరిశ్రమ కాదు. కేవలం ఫైనాన్స్ కంపెనీ. ఈ వసతి వల్ల దాని షేర్లు విదేశాలలో సులభంగా అమ్ముడై పోతాయి. కేంద్ర ప్రభుత్వ రంగ సంస్థ ఐడిబిఐ ఒకసారి ఇటువంటి అనుమతి అడిగితే రిజర్వు బ్యాంకు ఇవ్వలేదు. ఇప్పుడు అంబానీ అడిగితే మాత్రం కాదనలేక పోయింది. అదీ అంబానీ రాజకీయ పలుకుబడి!

### టెలిఫోన్ కార్మికుల కొత్తరకం నిరసన

బెంగుళూరులోని ఇండియన్ టెలిఫోన్ ఇండస్ట్రీస్ ఉద్యోగులు, కార్మికులు ప్రభుత్వ విధానాల పై కొత్త పద్ధతిలో తమ నిరసన తెల్పబోతున్నారు. ఇది ప్రభుత్వ రంగ సంస్థ. ఇంత కాలం టెలిఫోన్లకవసరమయ్యే పరికరాలన్ని ఇక్కడే తయారయ్యేవి. అయితే ఆర్థిక సంస్కరణల తర్వాత కేంద్ర ప్రభుత్వం దీన్ని పూర్తిగా విస్మరించింది. పరికరాలన్నీ విదేశీ కంపెనీలు సరఫరా చేస్తున్నాయి. ఫలితంగా ఈ పరిశ్రమ మూతపడే పరిస్థితి ఏర్పడుతున్నది. కేంద్ర ప్రభుత్వం తమ పట్ల సవతి తల్లి ప్రేమ చూపి, విదేశీ మోజులోనే వుండేటట్లయితే - విదేశాల నుంచి వచ్చిన పరికరాలతో నడిచే టెలిఫోన్ ఎక్ఛేంజి లన్నింటినీ స్తంభింప జేయాలని నిర్ణయించారు కార్మికులు.

**వ్యాపార లోకం**

# ఎన్ఆర్‌కె కుమారుడి పారిశ్రామిక విజయం

ఎన్ఆర్‌కెగా పిలవబడే నెల్లూరు రాధాకృష్ణా రెడ్డి గారి కుమారుడు, ఎస్. జగన్మోహన రెడ్డి యువతరం పారిశ్రామికులు గర్వ పడవలసిన రీతిలో ఒక పెద్ద పరిశ్రమకు మంజూరు సాధించాడు. ఎన్ఆర్‌కె అంటే - నెల్లూరులోని వెంకట రమణ త్రి థియేటర్ కాంప్లెక్స్ యజమాని; ప్రియ సిమెంట్ కంపెనీ అధినేత. చిన్న కాంట్రాక్టర్‌గా జీవితం ప్రారంభించి గుర్తింపు కలిగిన పారిశ్రామికుడుగా ఎదిగిన భేషజం లేని వ్యక్తి. ఆయన కుమారుడు జగన్మోహన రెడ్డి ఇంజనీరింగ్ తర్వాత పై చదువులకు ఆరాట పడకుండా, తండ్రి వ్యాపారాల పై ఆధార పడకుండా తన స్వంత పరిశ్రమను తన స్వంత కృషితో స్థాపించాలనే పట్టుదలతో ఆరేళ్ల పాటు చెప్పులరిగేట్లు తిరిగి, 250 కోట్ల పరిశ్రమకు సాంకేతిక పరిజ్ఞానం, ఆర్థిక సహాయం సాధించాడు. అమెరికాలోని అంతర్జాతీయ ఆర్థిక సంస్థ దీనికి లోన్ మంజూరు చేసింది. అభినందనీయమైన విజయం సాధించిన జగన్మోహన రెడ్డికి మా ప్రశంసలతో పాటు, పరిశ్రమకు సంబంధించిన పూర్తి వివరాలు పై వారం ప్రచురిస్తాము.

# మాగుంట కంపెనీ డైరెక్టర్‌గా రిజర్వు బ్యాంకు మాజీ గవర్నర్

మాగుంట సోదరులు, స్పిక్ ముత్తయ్య సహకారంతో మద్రాసులో ప్రారంభించిన మద్రాసు ఇండస్ట్రియల్ పార్క్ అనబడే సింగపూర్ కారిడార్ కంపెనీలో రిజర్వు బ్యాంకు మాజీ గవర్నర్ శ్రీ ఎస్. వెంకిట రమణన్ డైరక్టరుగా చేరారు. రిజర్వు బ్యాంకు గవర్నర్ వంటి అత్యున్నత పదవులు నిర్వహించిన వ్యక్తులు ప్రైవేటు కంపెనీలలో చేరడం చాలా అరుదైన విషయం. వెంకిట రమణన్ ప్రవేశంతో ఆ కంపెనీకి బ్యాంకింగ్, ఆర్థిక సంస్థలలో ప్రతిష్ట పెరుగుతుంది. లోన్లు, గిన్లు అడగకుండానే ఇవ్వడానికి అందరూ పోటీ పడతారు. వెంకిట రమణన్ ఆర్థిక శాస్త్రంలో నిష్ణాతుడు. రిజర్వు బ్యాంకు గవర్నర్‌గా ఆయన హర్షద్ మెహతా స్కాం సమయంలో కొన్ని ఆరోపణలకు, విమర్శలకు గురైనప్పటికీ అవన్నీ విచారణలో నిలవలేదు. ఆర్థిక మంత్రి డాక్టర్ మన్మోహన్ సింగ్ ఆయన్ను గట్టిగా సమర్థించారు.

ఈ కంపెనీలో మాగుంట కుటుంబం తరఫున శ్రీ మాగుంట శ్రీనివాసులు రెడ్డి, వారి ఫైనాన్స్ సలహాదారు ఎస్. వేణుగోపాల్ డైరక్టర్లుగా వుంటారు. వెయ్యి కోట్ల పెట్టుబడి పెట్టబోతున్న కంపెనీ ఇది.

### చిన్న నోట్ల రద్దు

రూపాయి, రెండు రూపాయలు, ఐదు రూపాయల నోట్లను క్రమేణా చలామణిలో నుంచి తొలగించి వేయాలని రిజర్వు బ్యాంకు నిర్ణయించింది. రిజర్వు బ్యాంకు గవర్నర్ డాక్టర్ సి. రంగరాజన్ ఈ విషయం బొంబాయిలో ప్రకటించారు. చిన్న నోట్లు చాలా త్వరగా చెడిపోయి, చిరిగి పోతున్నాయని, వాటిని తరచు మార్చి కొత్తవి విడుదల చేయడం కష్టంగా వుందని ఆయన చెప్పారు.

కరం 12 పేజీలో

# సమస్య తీరలేదు

కేంద్ర మానవ వనరుల శాఖ మాజీ మంత్రి శ్రీ అర్జున్ సింగ్‌ను కాంగ్రెస్ పార్టీ నుంచి సస్పెండ్ చేశారు ప్రధాని శ్రీ పి.వి. నరసింహా రావు. ఎఐసిసి అధ్యక్షుడిగా తనకున్న విచక్షణాధికారాలు ప్రయోగించి ఈ నిర్ణయం తీసుకున్నారాయన. దాదాపు నెల రోజుల తటపటాయింపు, నాన్పుడు వైఖరి, ముందు వెనుకల వూగిసలాట తర్వాత కాని అర్జున్ సింగ్‌తో అమీతుమీ తేల్చుకోవాలనే సాహసం సంతరించుకోలేక పోయారు ప్రధాని.

అయితే ఇప్పుడు కూడా ఆయన భయపడుతూనే ఈ నిర్ణయం తీసుకున్నారని భావించాలి. సాధారణంగా పివి నరసింహా రావు గారు ఇటువంటి విషయాలను కాంగ్రెస్ వర్కింగ్ కమిటీకి వదిలేసి, బాధ్యత నెట్టేస్తుంటారు. ఈసారి అది చేయబోయారు కాని, సిడబ్ల్యుసిలో ఏకాభిప్రాయం అసాధ్యంగా కన్పించి వ్యతిరేకత ఎదురయ్యే ప్రమాదం కన్పించడంతో తనంతట తాను నిర్ణయం తీసుకున్నారు. విషయం వర్కింగ్ కమిటీకి వెళ్లి అక్కడ అర్జున్ సింగ్ సానుకూల వాదనలు విన్పడి వుంటే ఆ తర్వాత ఆయన్ను పట్టడం అసాధ్యమై వుండేది. ఆ భయమే ఇంత దూరం సమస్యను నాన్చింది. అయితే ఇప్పటికైనా పివి ధైర్యం చేసి పార్టీలో క్రమశిక్షణ కాపాడడానికి ముందుకు వచ్చినందుకు అభినందించాలి.

అర్జున్‌సింగ్ చాలా కాలం నుంచే పార్టీ క్రమశిక్షణను ధిక్కరిస్తున్నారు. ప్రధానిని ఇరకాటంలో పెట్టి వినోదిస్తున్నారు. రాజీవ్ గాంధీ సమయంలో విపి సింగ్ వలె తానిప్పుడు కాంగ్రెస్ పార్టీ బలహీనతను వుపయోగించుకొని, ప్రజల దృష్టి నాకర్షించి అధికారం పొందాలన్నది ఆయన లక్ష్యం. అందువల్లే అవకాశం దొరికినప్పుడల్లా ఆయన పార్టీని, ప్రధానిని చికాకు పరచే సంఘటనలు సృష్టిస్తున్నారు. ఇటువంటి క్రమశిక్షణా రాహిత్యాన్ని సహించడం ఆత్మహత్యా సదృశ్యం. ఎంత కఠినమైన చర్యలు ఎంత త్వరగా తీసుకొంటే అంత మేలు.

అయితే అర్జున్‌సింగ్‌కు పార్టీలో ముఖ్యుల నుంచి మద్దతు లభించడం ఆందోళన కల్గిస్తున్నది. ఎన్‌డి తివారి, ఎకె ఆంటోని, కల్పనాథ్ రాయ్, దిగ్విజయసింగ్, టిఎన్ రామమూర్తి వంటి వారందరూ ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ ఆయన్ను సమర్థిస్తున్నారు. పివి తెలివిగా ఐదు రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికలకు టిక్కెట్ల పంపకం జరిగిపోయి పోలింగ్ తేది దగ్గర పడిన తర్వాత ఈ నిర్ణయం తీసుకున్నారు. కాని లేకుంటే శరద్ పవార్ వంటి సీనియర్ల నుంచి కూడా వ్యతిరేకత ఎదురై పరిస్థితి ప్రమాదంలో పడి వుండేది. విపిసింగ్ వలె నీతిమంతుడున్న మంచి పేరు సైతం లేని అర్జున్ సింగ్ పార్టీలో మద్దతు సమీకరించు కోవడానికి కారణం ఆయన ధోరణి తప్పయినా, ఆయన లేవనెత్తిన సమస్యలు సజీవమైనవి కావడమే. రాజీవ్ గాంధీ హత్యోదంతంలో దోషులను శిక్షించకుండా తటపటా యించడం, మైనారిటీలు, హరిజనాది బలహీన వర్గాల నుంచి కాంగ్రెస్ పార్టీ దూరమైపోతున్నా నివారణ చర్యలు చేపట్టక పోవడం, ఆర్థిక సంస్కరణలు పేద వాడిని మరింత పేద వాడిగా మారుస్తుండడం అర్జున్‌సింగ్ లేవనెత్తిన అంశాలు. ఇప్పటికి పివి వీటికి సమాధానాలు చెప్పడం లేదు. సర్దుబాటు చర్యలు చేపట్టడం లేదు. అసలు సమస్యను అట్నే పెట్టి అర్జున్‌సింగ్‌ను తప్పించినంత మాత్రాన పార్టీలోని సంక్షోభం సమసి పోదు. ఈ వాస్తవాన్ని పివి గుర్తించాలి.

ఇప్పటికే దేశంలో కాంగ్రెస్ పార్టీ నిర్వీర్యమై పోయి వుంది. రేపటి అసెంబ్లీ ఎన్నికలలో కూడా ఓడిపోతే ఒక జాతీయ పార్టీగా గుర్తింపు, గౌరవం సైతం కోల్పోతుంది. కాంగ్రెస్ మహా సంస్థ క్రమక్రమంగా మరణ శయ్య పైకి చేరుతుంటే ప్రధాని కాని, ఆయన అధ్వర్యంలోని పార్టీ సంస్థలు కాని పట్టీ పట్టనట్లు వ్యవహరించడం క్షంతవ్యం కాదు. తక్షణం పార్టీని బతికించే మార్గాలు అన్వేషించాలి. ఆ దిశలో కృషి చేయకుండా కేవలం ఆ సమస్యలు లేవనెత్తిన అర్జున సింగాదులను పార్టీ నుంచి తొలగిస్తూ పోతే, రోజుకొక అర్జున్‌సింగ్ పుట్టుకొని వస్తాడు. పివి ఈ వాస్తవం గుర్తెరిగి, తదను గుణంగా ప్రతిస్పందిస్తేనే కాంగ్రెస్‌కు భవిష్యత్తు లేకుండే అధోగతే!

## జమీన్‌రైతు

27-1-1945
పేజీలు, 8, వెల. 0-1-6

### 50 ఏళ్లక్రితం ఈవారం

**వెంకటగిరి - చిఱుతపులుల బాధ**

**ఒక తరుపు**

12.1.45 తేది మధ్యాహ్నం తీర్థం పాటికి ఉత్తరంగా 3 ఫర్లాంగులలో శనగపల్లి వెంకట సుబ్బయ్య గారి తరుపు పెయ్య రు. 50 ల క్రయం చేయుదాన్ని చిఱుతపులి చంపింది.

**12 తేది సా. ఒక కోడె**

ఆ సాయంత్రం తీర్థంపాడుకు దక్షణంగా నక్కా పెంచలయ్య తాలూకా రు. 80 లు వెల జేయు ఒక కోడెదూడను చంపింది.

**12 తేది సా. దున్నపోతు**

పారోలు మస్తాన్ దున్నపోతును షుమారు రు. 65/- క్రయం చేయుదాన్ని వూరికి 1/2 మైలులో బసవడి చెరువుకు మడమరగా చంపి వేసింది.

**14 తేది దున్నపోతు**

పారవోలుకు అరమైలులో 14 సా. యింటికి వస్తుండగా రు. 60 లు వెలచేయు కొడవలూరు బల రామయ్య తాలూకా దున్నపోతును చంపింది.

**15 తేది ఒక కోడె**

తీర్థంపాటిలో 15 తేది పగలు 1 గంటకు జమేదారి కంచెకు దక్షణంగా, వూరికి అర ఫర్లాంగులో మనిషి దగ్గర వుండి చూస్తుండగానే చప్పిడి యానాది రెడ్డి గారి కోడె దూడను షుమారు రూ. 100 ల క్రయం చేయుదాన్ని చంపి వేసింది.

**మహా దారుణం**

చిఱుతపులుల బాధ మహాదారుణంగా వుంది, ఎస్టేటు వారు రైతుల మీద వుండే చలపాది తనంతో ఈ చిరుత పులులను వేటాడడం లేదు. దిన దినం పశువులను విపరీతంగా బలి గొంటున్నవి. ఎవరూ దిక్కు లేదు. తీర్థంపాడు, పారవోలు గ్రామాల పశువులు, మనుష్యులు భయపడి పోయివున్నారు. వ్యవసాయానికి ఆధార భూతమైన పశుధనం పోతే యిక రైతు ఏ విధంగా కోలుకో గలడు?

12, 14, 15 తేదుల్లోనే 5 పశువులు ఆహుతి అయినవి. ఈ విధంగా కొన్ని మాసాల నుండి చిరుత పులుల స్వైర విహారం జరుగుతున్నది.

రైతుల వద్దనున్న తుపాకులన్నీ 1932 లోనే పీక్కున్నారు. అందువల్ల రైతులు నిస్సహాయులై కూర్చున్ననారు.

**నెల్లూరు ముచ్చట్లు**

**అధికార వర్గం**

పోలీసు సూపరెంటు ఎ.యి.డి. పెడ్రిక్ గారిని మలబారు స్పెషల్ పోలీసు ఉపనాయకునిగా నియమించారు. వీరికి బదులు, యస్. బాలకృష్ణం శెట్టి గారిని యిక్కడకు వేశారు. పెడ్రిక్ గారు ఫిబ్రవరి 13 వ తేది వెళ్లుతారట.

తరవ 8 పేజిలో

# అవినీతి అధికారులంటే ఎమ్మెల్యేలకు భయమెందుకు?

## జనవాణి

తెలుగుదేశం ప్రభుత్వం తాను అధికారం లోకి వస్తే అవినీతిని అంతం చేస్తానని ప్రతిన బూనింది. కానీ నెల్లూరు జిల్లాకు సంబంధించి ఇద్దరు ఇరిగేషన్ ఇంజనీర్ల మీద పలు ఆరోపణలు వచ్చాయి. వీరిలో ఒకరిని నెల రోజులు సెలవు పెట్టమని ఒక ఎమ్మెల్యే బ్రతిమాలితే, మరొకరిని కొన్నాళ్లు దాటాక మళ్లీ నియమింప చేస్తానన్నారట. తెలుగుదేశం ఎమ్మెల్యేలకు తొలి శాసనసభ సమావేశాలకు పోయి వచ్చే ముందే అవినీతి అధికారులంటే ఎందుకంత భయమేసింది?. వీరికి - వారికి వున్న సంబంధ మేమిటి ? ఇకనైనా అవినీతి అధికారులపై చర్య తీసుకొనేందుకు జిల్లా ఎమ్మెల్యేలు అడ్డు పడరని ఆశిస్తాం.

చెన్నూరు - ఎం.ఆర్.రాఘవరెడ్డి

### సత్య సాయిబాబాను అభినందించాలి !

పుట్టపర్తి సాయిబాబాపై వున్న వివాదాలను తీసి పక్కన పెడితే ఆయన చేపడుతున్న కార్యక్రమాలు, పథకాలు ప్రజాహిత మైనవని చెప్పడంలో సందేహం లేదు. రాయలసీమ వాసులు మంచినీటి కోసం ఏళ్ల తరబడి కష్టాలు పడుతున్నారు. అటువంటి వారి కోసం 200 కోట్లు ఇచ్చేందుకు బాబా సిద్ధపడటం గొప్ప విషయం. అదీగాక సత్యసాయి సేవా ట్రస్టు ఈ పథకం స్వయాన చేపట్టి పూర్తి చేయాలను కోవడం అభినందించ దగ్గ విషయం. ప్రభుత్వమే ఈ పథకాన్ని చేపట్టి వుంటే, ఎన్ని వార్షిక ప్రణాళికలు దాటి పోయి వుండేవో ? 1995 నవంబరు 23 లోగా ఈ పని పూర్తి చేయాలను కోవడం గొప్ప విషయం. ఈ సత్కార్యంతో రాయలసీమ గుండెల్లో బాబా చిరస్థాయిగా నిలచిపోతారు. ఈ పథకానికి ఇటలీకి చెందిన ఒక సాయి భక్తుడు 150 కోట్లు ఇచ్చి సహాయ పడతానన్నందుకు ఆయనను అభినందించాలి.

నెల్లూరు - వి. రవికుమార్

### చిత్తశుద్ధి గల అధికారి సతీష్ చంద్ర

జిల్లా జాయింట్ కలెక్టర్ సతీష్ చంద్ర కర్నూలు జిల్లా జాయింట్ కలెక్టర్‌గా బదిలీ కావడం జిల్లా ప్రజలకు బాధను మిగిల్చింది. ప్రభుత్వాధికార్లు శాశ్వతంగా ఒక చోట వుండడం వీలు కాదు కాబట్టి సర్దుకుపోక తప్పదు. సతీష్ చంద్రకు జిల్లాకు ఏదో విడమర్చి చెప్పలేని బంధం వుందనుకుంటే మిగిలిన హోదాల్లో విమర్శ అనేది లేకుండా ఆరేళ్లు పనిచేశారు. నీతి, నిజాయితీల్లో సతీష్ చంద్రను ఎవరూ వేలెత్తి చూపలేరు. అధికారి గానేకాక సాహిత్య, నృత్య, నాటక రంగాల సంస్థలతో స్నేహ సంబంధాలు ఏర్పరచుకొని అమూల్య సలహా లిచ్చేవారు. అక్షరాస్యత, సంపూర్ణ మద్య నిషేధం, పొదుపు లక్ష్మి, ఆరోగ్య దీపం పథకాల కోసం ఎంతో కష్టపడ్డ అధికారియైన సతీష్ చంద్ర మళ్లీ కలెక్టర్‌గా నెల్లూరు రావాలని కోరుకుందాం.

నెల్లూరు - కె.వి.రంగయ్య

### ప్రధానిని రామ్మూర్తి విమర్శించడమా?

తమిళనాడు కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడు వి. రామ్మూర్తి, ప్రధాన మంత్రి నరసింహా రావును గొర్రెచేవతో పోల్చారు. అదే రష్యా అయితే రామ్మూర్తి అసలు నోరు తెరిచే వారు కాదు. ప్రజాస్వామ్య దేశం కాబట్టి పివిని విమర్శించినా చెల్లిపోయింది. వాస్తవంగా ఆలోచిస్తే రామ్మూర్తి టిఎన్‌సిసి నామినేటెడ్ అధ్యక్షుడు. పివి ప్రత్యక్షంగా ఎన్నికల్లో నిలబడి గెల్చి ప్రధానిగా ఎన్నికయ్యారు. జయలలితకు రామ్మూర్తికి తప్పు - నిప్పు కాబట్టి పివిని తిట్టి పోయడం తగదు. పివి ప్రధాని అయ్యాక ఆర్థిక సంక్షోభంలో వున్న దేశాన్ని గట్టెక్కించారు. స్వాతంత్ర్యం వచ్చిన 47 ఏళ్లలో

తరవ 7 పేజిలో

# నరక లోకపు రహదారుగా మారుతున్న నెల్లూరు రోడ్డు!

ఘనత వహించిన రోడ్లు భవనాల శాఖ ఇంజనీర్లు, కాంట్రాక్టర్లను నెల్లూరు పౌరులు మరచిపోకుండా వాళ్ళే తరచూ తలచుకునేలా చేస్తుంటారు. 6 నెలల క్రితం లక్షలాది రూపాయలు వెచ్చించి టౌన్‌లో వేసిన తారురోడ్డు అప్పుడే అధ్వాన్నమై పోయింది. బస్సు, కారు, స్కూటర్, రిక్షా, సైకిల్ చివరికి నడిచి వెళ్లే వారికి సైతం ప్రత్యక్ష నరకాన్ని చూపిస్తున్నాయి టౌన్ లోని రోడ్లు. ఆత్మకూరు బస్టాండ్ దాటాక బోస్ బొమ్మ వద్ద ఈ గతుకులు మొదలవుతాయి. ఇక్కడ డబల్ రోడ్డులో ఒకవైపు మాత్రమే వాహనాలు పోయేంత దరిద్రంగా గుంటలు, మిట్టలతో వుంది రోడ్డు. ఈ సెంటర్ దాటాక కనక మహల్ నుండి న్యూ టాకీస్ వరకు వున్న మలుపులో ఒళ్లు హూనమై పోతుంది. వి.ఆర్.సి., వై.ఎం.సి. గ్రౌండ్స్, వెంకట రమణ థియేటర్, టి.టి.డి. కళ్యాణ మండపం సెంటర్ల రోడ్డుపై వాహనాల్లో వెళ్లేవారికి ప్రత్యక్ష నరకం ప్రతి రోజూ కళ్ల ముందు సాక్షాత్కరిస్తుంది. కుదుపు కుదుపుకు ఏమౌతుందోనని రోడ్డుపై వెళ్లే వారంతా అరచేతిలో ప్రాణాలు పెట్టుకొని పోతుంటారు. చీకటి పడ్డాక వాహనాల్లో ప్రయాణం ప్రమాద భరితంగా తయారై వుందంటే రోడ్డు ఎంత దరిద్రంగా వుందో వర్ణించ నక్కర లేదు. నిత్యం జిల్లా అధికారులంతా ఈ రోడ్డుపైనే వెళ్తుంటారు. ఒక్కరూ స్పందించడం లేదు. 25 తేది నుండి అధ్వాన్నపు రోడ్డుకు తూత్ మాలిష్ రిపేర్లు చేస్తున్నారు. వాటిని చూస్తుంటే కడుపు మండిపోతుంది. నెల తర్వాత మళ్లీ రోడ్డు యధాతథ స్థితికి రావడం ఖాయం. రోడ్లు వేసే కాంట్రాక్ట్, రిపేరు చేసే కాంట్రాక్టులతో ఆర్ అండ్ బి అధికారులు, ఇంజనీర్లు లక్షాధికార్లు కావడం మినహా కాసింత పని నాణ్యత, ప్రజలు రోడ్డుపై భయం లేకుండా పోయే రోజు కనిపించడం లేదు.

## నెల్లూరు సంగతులు

### మహిళాస్టేషన్ 10 సెక్షన్ల కేసులు విచారిస్తుంది!

నెల్లూరు టౌన్‌లో మహిళా పోలిస్ స్టేషన్‌ను ఎస్పి. జె. పూర్ణచంద్ర రావు 21 తేది ప్రారంభించారు. సుబేదార్ పేటలోని క్రైమ్ స్టేషన్ ఆవరణలో ఈ స్టేషన్ ఏర్పాటయింది. స్టేషన్‌లో సబ్ ఇన్‌స్పెక్టర్ తోపాటు, ఇద్దరు హెడ్ కానిస్టేబుళ్లు, 18 మంది కానిస్టేబుళ్లు పని చేస్తారు. స్టేషన్ పని తీరును ఎస్.పి. విలేఖరులకు వివరిస్తూ పది సెక్షన్ల క్రింద కేసులు ఈ స్టేషన్‌లో నమోదు చేస్తారని చెప్పారు. వరకట్న హత్యలు, చావులు, ఆత్మహత్యలు, అత్త మామల వేధింపులు, స్త్రీ హత్యలు, ఇద్దరు భార్యలు కలిగివున్న కేసులు, అత్యాచారాలు, కిడ్నాపింగ్, ఈవ్ టీజింగ్ కేసులు నమోదు చేసుకుంటారు. వ్యభిచార కేసులను మాత్రం ఆయా ప్రాంతాలలోని టౌన్ పోలీస్ స్టేషన్లు చూసుకొంటాయి. టౌన్ పరిధిలో మహిళలపై అఘాయిత్యాలు జరిగితే నేరుగా వచ్చి ఫిర్యాదు చేయవచ్చు. దగ్గరలో వున్న టౌన్ పోలీస్ స్టేషన్‌లో ఫిర్యాదు ఇచ్చినా ఇక్కడకు బదిలీ చేస్తారు. గత ఐదేళ్లలో మహిళలపై జరిగిన అఘాయిత్యాలకు సంబంధించిన 782 కేసులు విచారణలో వున్నాయట. వీటిలో ఈవ్ టీజింగ్‌కు సంబంధించి 462 కేసులు నమోదై వున్నాయంటే టౌన్‌లో ఈ సమస్య తీవ్రతను గుర్తించ వచ్చు. ప్రస్తుతానికి స్టేషన్‌కు హెడ్ కానిస్టేబుల్ రాజేశ్వరిని ఇన్‌ఛార్జిగా నియమించారు. జిల్లాలో మహిళా సబ్ ఇన్‌స్పెక్టర్ లేనందువల్ల పోస్టు భర్తీకి డిఐజిని కోరగానే వెంటనే భర్తీకి అనుమతించినట్లు ఎస్పి చెప్పారు. కార్యక్రమంలో వెంకటగిరి బెటాలియన్ కమాండెంట్ శివరామ రెడ్డి, టౌన్ డిఎస్పి లక్ష్మిరెడ్డి, సిఐ వీరారెడ్డి తదితరులు పాల్గొన్నారు.

### రిప్స్‌లో కంప్యూటర్ సెంటర్

వి.ఆర్. ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పోస్టు గ్రాడ్యుయేట్ స్టడీస్ సెంటర్‌లో కంప్యూటర్ విభాగాన్ని కళాశాల కరస్పాండెంట్ శ్రీ ఆనం వివేకానంద రెడ్డి 21 తేది ప్రారంభించారు. 15 లక్షల వ్యయంతో 15 కంప్యూటర్లు, ఒక ప్రింటర్‌ను ఈ సెంటర్‌లో ఏర్పాటు చేశారు. ఈ సందర్భంగా వివేకానంద రెడ్డి మాట్లాడుతూ ఎస్‌వి యూనివర్సిటీ పరిధిలో కంప్యూటర్ కోర్సుకు సంబంధించి మూడు కళాశాలలు మాత్రమే వున్నాయన్నారు. కంప్యూటర్ కోర్సు మూడు సంవత్సరాలు చదవాలని, సంవత్సరానికి 12,500 ఫీజు చెల్లించా లన్నారు. జిల్లాలో తమ సంస్థలో మాత్రమే ఈ కోర్సు వుందని చెబుతూ మరో ఆరు నెలల్లో 8 లక్షల వ్యయంతో కంప్యూటర్ సెంటర్‌ను మరింత అభివృద్ధి చేస్తామన్నారు. సెంటర్‌కు కావాల్సిన కంప్యూటర్లు శ్యాం డాటా ప్రొడక్ట్స్ వారు అందజేసినట్లు చెప్పారు.



వి.ఆర్. కాలేజిలో నూతనంగా ప్రారంభించిన పోస్ట్ గ్రాడ్యుయేట్ కేంద్రం (రిప్స్) లో కంప్యూటర్ విభాగాన్ని ప్రారంభిస్తున్న కరస్పాండెంట్ ఆనం వివేకానంద రెడ్డి

# నిరుపేద అంధులకు అమెరికన్ ఆస్పత్రిలో వెలుగు కిరణాలు!

పందేళ్లు నిండిన అమెరికన్ ఆసుపత్రిలో కాలానుగుణంగా కొత్త కొత్త వైద్య విభాగాలు ఏర్పాటవుతున్నాయి. గత వారంలోనే స్వీడన్ బాప్టిస్ట్ యూనియన్ వారు ఆర్థోస్కోపిక్ అధునాతన పరికరం ఒకటి బహూకరిస్తే, 25 తేది 35 లక్షల వ్యయంతో నిర్మించిన హౌస్ ఆఫ్ న్యూసైట్ ప్రారంభోత్సవం జరిగింది. జర్మన్ దేశస్థుడు డాక్టర్ వాల్టర్ హార్టర్ దంపతులు ఈ అపురూపమైన విరాళం అందించారు. ఈ మొత్తంతో అధునాతన కంటి చికిత్స విభాగం నెలకొల్పారు. హౌస్ ఆఫ్ న్యూసైట్ పేరిట వున్న ఈ విభాగంలో మొత్తం మూడు భవనాలు నిర్మించారు. అవుట్ పేషెంట్ డిపార్ట్‌మెంట్, జాయింట్ ఆపరేషన్ థియేటర్లు, 30 జనరల్, 8 స్పెషల్ బెడ్లు ఇక్కడ వుంటాయి. ఆస్పత్రికి వచ్చిన రోగికి 24 గంటల లోపు అన్ని రకాల చికిత్సలు చేసి అవసరమైతే ఆపరేషన్ కూడా చేసి పంపటం న్యూ సైట్ ప్రత్యేకత. ఇక్కడ చికిత్స పొందాలను కొనేవారు రిజిస్ట్రేషన్ ఫీజుగా అయిదు రూపాయలు చెల్లిస్తే సరిపోతుంది. కంటి ఆపరేషన్లు చేయించుకొన్న పేషెంట్ల నుంచి ఎటువంటి బలవంతం లేకుండా వారిచ్చినంత సొమ్ము మాత్రమే తీసుకొంటారు. మిగతా మొత్తాన్ని ఆసుపత్రి వారే భరిస్తారు. ప్రభుత్వ లెక్కల ప్రకారం జిల్లాలో

## జర్మన్ దంపతుల నిరుపమాన వదాన్యత!

రెండు సంవత్సరాల క్రిందట 33 వేల మంది కంటి శుక్లాలను కలిగి వున్నారని, వాటిని తొలగించి చీకటిలో వున్న వ్యక్తులకు వెలుతురు చూపాలన్న ఆశయం తోనే ఈ ప్రాజెక్టును ప్రారంభించినట్లు హాస్పిటల్

కొరవ 10 పేజీలో

# రామతీర్థమే జిల్లాలో అతి ప్రాచీన దేవాలయం!

## నెల్లూరు జిల్లా ప్రాచీన చరిత్రకు నూతన వ్యాఖ్యానం!

కొల్లూరి సాయిభక్త కేశవ
సాంకేతిక సహాయకుడు, పురావస్తుశాఖ, నెల్లూరు

(గత సంచిక తరువాయి)

ఇక్కడ దొరికిన నాణెములలో మౌర్యుల కాలం నాటివైన వెండి విద్ధాంక నాణాలు, శాతవాహన, ఇక్ష్వాకు, చోళ, చాళుక్య, తెలుగుచోళ, విజయనగర, ముస్లిమ్, బ్రిటిష్ వారి నాణాలు ఇక్కడ సేకరింప బడ్డాయి. దీనిని బట్టి ఇక్కడ జనవాసం 2000 సంవత్సరం నుండి నేటి వరకు నిరంతరంగా జరుగుతూనే వున్నదని చెప్పగల్గుతున్నాము.

క్రీ.పూ. 3వ శతాబ్దంలో దువ్వూరు రాజకీయ కేంద్రంగా కూడా పరిఢవిల్లి వుండవచ్చు. ఆ కాలానికి చెందిన ఇటుకరాతి కోటగోడలు, ఇతర కట్టడాల శిథిలాలు ఇక్కడ వెలువడ్డాయి. ఇవేకాక గూడూరు మండలంలోని కోటమిట్ట, నాయుడుపేట మండలంలోని పుదూరు గ్రామాలలో కూడా క్రీ.పూ. 3వ శతాబ్దం నుండి క్రీ.శ. 2 వ శతాబ్దానికి చెందిన కోటగోడల అవశేషాలు కనిపిస్తున్నాయి. ఈ ఆధారాల వల్ల మౌర్య, శాతవాహన, ఇక్ష్వాకుల, కాలంలో ఇవి రాజకీయ కేంద్రాలుగా పనిచేసినట్లు స్పష్టమగుచున్నది.

తర్వాత ముఖ్యమైన ఆధారం నాణాలు. దువ్వూరు, అల్లూరు గ్రామాలలోనూ నెల్లూరు పట్టణంలోనూ మౌర్యుల కాలం నాటి వెండి విద్ధాంక నాణాలు దొరికాయి. వీటిని వెండి కార్షపణాలని పిలిచేవారు.

శాతవాహనుల కాలానికి చెందిన నాణాలు దువ్వూరు, పడుగుపాడు, కొడవలూరు గ్రామాలలో లభ్యమైనాయి. కొడవలూరు, పడుగుపాడులలో లభించిన నాణాలు వాశిష్ఠపుత్ర శాతకర్ణి(క్రీ.శ. 116-143) గౌతమి పుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణి (క్రీ.శ. 165-194)విగా గుర్తించారు. దువ్వూరు గ్రామంలో లభ్యమైన శాతవాహనుల నాణాలు చంద్రశ్రీ శాతకర్ణి(క్రీ.శ.200-203) విగా గుర్తించారు. ఈ నాణాలన్నింటిని నెల్లూరీయుడైన ప్రముఖ పురావస్తు శాస్త్రవేత్త ఇంగువ కార్తికేయ శర్మ పరిశీలించి నివేదికను ప్రచురించారు.

నాణాలకు చెందిన మరొక ముఖ్య ఆధారం రెండు శతాబ్దాల క్రితమే మనకు లభించినది. నెల్లూరు పట్టణంలో రోమన్ సామ్రాజ్యానికి చెందిన బంగారు నాణాలు దొరికినట్లుగా 1785, 1786 సంవత్సరాలలో మద్రాస్ ప్రెసిడెన్సీ గవర్నర్‌గా వున్న అలెగ్జాండర్ డేవిడ్‌సన్ గారి లేఖలలో వ్రాసి వుంది. ఇవి క్రీ.శ. 2వ శతాబ్దంనాటివి. ఈ మధ్యకాలంలో పురావస్తు శాఖవారు కోటమండలంలోని కొత్తపట్నం గ్రామంలో జరిపిన త్రవ్వకాలలో క్రీ.పూ. 2 వ శతాబ్దానికి చెందిన చైనా దేశీయుల మృణ్మయ పాత్రలు, రోమన్ దేశస్థుల మృణ్మయ పాత్రలు లభించినవి. దీనిని బట్టి ఆరోజులలో చైనా,రోమ్ దేశస్థులు నెల్లూరు ప్రాంతం వారితో వర్తక వాణిజ్యాలు జరుపుతున్నట్లు విదితమగుచున్నది. నెల్లూరు అన్ని రంగాలలో అభివృద్ధి చెంది విదేశాలతో వర్తకం చేయగలిగే స్థితిలో ఉన్నదని అర్థమవుతుంది.

ఇంకా ప్రాచీన చారిత్రక కాలానికి చెందిన ప్రదేశాలైన జువ్వలదిన్నె, గంగపట్నం, మైపాడు, గవళ్లపాళెం, యల్లాయపాళెం, కొత్తపట్నం, కల్లూరు, యేకొల్లు, ఉచ్చూరు, దంపూరు, ఐతంపాడు, తిరువీధిపాడు, పుదూరు, అనెమడుగు, గుడిపల్లిపాడు, వావిలేటిపాడు, వేదాయపాళెం గ్రామాలలో ఇటువంటి నాణాలు కనుగొనబడ్డాయి.

కొరవ 8 పేజీలో

కలసి పని చేయడమా? రాజీ పేరుతో కలహాలు పెంచుకోవడమా?

# కాంగ్రెస్ నాయకులు ఏమి చేయాలిప్పుడు?

జిల్లా కాంగ్రెస్ రాజకీయాలలో రాజీ పేరుతో జరుగుతున్న ప్రహసనం కొనసాగుతూనే వుంది. కాని ఎవరికి వారు తమ ప్రయోజనాల నుద్దేశించి మాత్రమే రాజీ జరగాలని ప్రయత్నించడంతో ప్రతిపాదిస్తుండడంతో ఎవర్నీ ఎవరూ నమ్మడం లేదు. రాజీ ఆలోచన, ఆరాటం మాగుంట సుబ్బరామ రెడ్డిగారి పక్షం నుంచే వస్తుండడం గమనార్హం. ఆయన తరఫున శ్రీ మాదాల జానకిరాం నిన్న (26 తేది) శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డిని కలిశారు. శ్రీ జెకె రెడ్డి ఆ మధ్య ఆనం రామ నారాయణ రెడ్డిని కలిశారు. రెండు దగ్గర్లా ఇద్దరూ రెండు రకాల ప్రతిపాదనలు విన్పించారు.

తాను, జనార్ధన రెడ్డిగారు ఏదో ఒక సందర్భాన్ని పురస్కరించుకొని, ఒక సభ సృష్టించి, ఒకే వేదికపై ఆశీనులైతే రాజీ పడినట్లే లెక్కని తాను భావిస్తానని సుబ్బరామ రెడ్డిగారు జానకిరాం ద్వారా సందేశం పంపారట. అయితే ఆ సభలో ఆనం సంజీవ రెడ్డి పాల్గొన రాదని షరతు విధించారట. జనార్ధన రెడ్డి తనతో కలిస్తే తనతో వున్న చిల్లర నాయకులందరినీ తాను వదిలేస్తానని చెప్పారట ఆయన. జెకె రెడ్డి - ఆనం రామనారాయణ రెడ్డికి విన్పించిన సందేశం దీనికి పూర్తి విరుద్ధంగా వుంది. జనార్ధన రెడ్డి రాష్ట్ర రాజకీయాలలో తప్ప జిల్లా స్థాయిలో మెలగ లేదు కాబట్టి, ఆయన్ను ప్రక్కన బెట్టి మనందరం కలిసి పోదాం అన్నది జెకె రెడ్డి రాయబార సందేశం.

ఈ పరస్పర విరుద్ధ ప్రతిపాదనల ప్రహసనం - దాన్ని ఉద్దేశించిన వారికే కాదు, దాన్ని వింటున్న సాధారణ కాంగ్రెస్ వాదులెవరికి కూడా మ్రింగుడు పడడం లేదు. జనార్ధన రెడ్డి గారు రాజీ అన్న పదమే బాగా లేదంటున్నారు. ఆయన కోణం నుంచి ఆలోచిస్తే అది సమంజస మన్పిస్తూంది. సుబ్బరామ రెడ్డికి, జనార్ధన రెడ్డికి మధ్య తగువు లేమీ లేవు. ఇద్దరూ ఎక్కడా, ఎప్పుడూ బహిరంగ ఆరోపణలు చేసుకోలేదు. అటువంటప్పుడు ఇద్దరి మధ్య రాజీ అనే ప్రస్తావన ఏముంది? జనార్ధన రెడ్డి ముఖ్యమంత్రిగా వున్నప్పుడు మాగుంట సుబ్బరామ రెడ్డి ఆయనతో అత్యంత సన్నిహితంగా తిరిగారు. రాజకీయంగా, వ్యాపార పరంగా పలు ప్రయోజనాలు పొందారు. జిల్లాలో డెయిరీ ఛైర్మన్ వంటి పదవులన్నీ ఆయనే స్వంతం చేసుకొన్నారు. ముఖ్యమంత్రి పదవి పోయిన తర్వాత పెద్ద కారణమేదీ లేకుండా ఆయనంతట ఆయనే జనార్ధన రెడ్డికి దూరంగా తొలగి పోయారు. అధికారంలో లేని వ్యక్తి పట్ల ఆసక్తి తగ్గడం సహజమే కదా!!

జిల్లాలో తనకంటూ ఒక స్వంత గ్రూపు ఏర్పర్చు కోవాలని, జనార్ధన రెడ్డికి ప్రత్యామ్నాయంగా తాను జిల్లా నాయకుడిగా గుర్తింప బడాలనే తాపత్రయమే సుబ్బరామ రెడ్డిని ఆయనకు దూరం చేసింది. జనార్ధన రెడ్డి వ్యతిరేకు లనదగిన అంకయ్య గౌడ్ వంటి వారందరూ మాగుంట ఇంట్లో చేరడంతో ఇద్దరి మధ్య ఎడం పెరిగింది. మాగుంట ప్రవేశం వరకు - నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి నిష్క్రమణ తర్వాత - జిల్లా కాంగ్రెస్‌లో వర్గాలంటూ లేవు. వాటిని ప్రారంభించింది ఆయనే; ఇప్పుడు కలహాలను కుంటున్నదీ ఆయనే! చేసిన తప్పుకు పశ్చాత్తాప పడి, సరిదిద్దు కోవాలను కోవడం స్వాగతించ దగిన పరిణామం. కాని, అది కలయికగా వుండాలే తప్ప, రాజీ అని పేరు పెట్ట వలసిన అవసరం ఏముంది? ఇద్దరి మధ్య తగువు వుంటే రాజీ అవసరం. ఒక పక్షంలోనే పొరపాటు జరిగినప్పుడు, రెండవ పక్షం ఆ పొరపాటును క్షమించి వదిలేయడానికి సిద్ధ పడినప్పుడు స్వచ్ఛందంగా వచ్చి కలిసిపోతే సరిపోతుంది కదా? మొన్నటి ఎన్నికల లోనూ జనార్ధన రెడ్డి ఎక్కడా కాంగ్రెస్ అభ్యర్థుల ఓటమికి తాపత్రయ పడలేదు. వెంకటగిరిలో తాను వేమారెడ్డి రామచంద్రా రెడ్డికి డబ్బు ఇవ్వడం తప్ప, జనార్ధన రెడ్డిని ఓడించేందుకు మరే ప్రయత్నమూ చేయలేదని సుబ్బరామ రెడ్డిగారు తన రాయబారంలో వివరణ ఇచ్చారట. ఆవరణలోని వాస్తవం సంగతి ప్రక్కన



పులికాట్ ప్రాంత పర్యావరణ పరిరక్షణ సదస్సులో ప్రసంగిస్తున్న మాజీ జాయింట్ కలెక్టర్ సతీష్‌చంద్ర. డాక్టర్ పి.జె. సంజీవ రాజ్, ఆచార్య పి.సి. రెడ్డి, ఐఏఎస్ నాయుడు వేదికపై వున్నారు.

పెడితే, తాను తప్పు చేయలేదని ఆయన నమ్ముతున్నట్లే లెక్క. ఇద్దరూ తప్పులు చేయనప్పుడు, తగువులు లేననుకున్నప్పుడు కష్టం కాదు.

అందువల్ల కలయికకు అది అభ్యంతరం కాకూడదు. ఒక బహిరంగ సభా వేదిక మీద తాను, జనార్ధన రెడ్డి భాయి భాయి అనుకోవా లన్నది మాగుంట అభిమతంగా వున్నట్లుంది. అది సరైన ఆలోచన కాదు. కలిసి వేదికెక్కడం చులకన ప్రాయంగా వుంటుంది. పైపెచ్చు స్థాయీ భేదం సమస్య వుండనే వుంది కదా? కలయికకు సిద్ధపడిన సుబ్బరామ రెడ్డిగారు, జనార్ధన రెడ్డిగారి నాయకత్వ స్వీకరణకూ సిద్ధ పడాలి. అప్పుడే కలయికకు అర్థం ప్రయోజనం. సమస్థాయిలో మెలగా లనుకుంటే, కలయిక తాత్కాలికమే! మళ్లీ పేచీలు పుట్టుకొని వస్తాయి.

ఆనం సంజీవరెడ్డి మినహాయింపు అర్థం లేని షరతు. నిజంగా జిల్లాలో కాంగ్రెస్ పార్టీని బ్రతికించ దల్చుకోవడమే రాజీ అంతరార్థమైతే అందరూ కలహాలు మాని, పాత సంఘటనలు మర్చిపోయి సమైక్యంగా పని చేయాలి. సంజీవ రెడ్డి గారు కూడా కాంగ్రెస్ నాయకుడే! జనార్ధన రెడ్డికి ఆయనతో విభేదాలేవీ లేవు. సుబ్బరామ రెడ్డి గారి కోసం సంజీవ రెడ్డిని వదులు కోవలసిన అవసరం జనార్ధన రెడ్డికి ఏముంది? కొత్త స్నేహితం కోసం పాత స్నేహితం వదల మనడం ఆలోచించి చెప్తున్న మాట కాదు.

మాగుంట వర్గం నియమించిన ఇద్దరి దూత లకూ తమ తమ పరిధుల్లో స్వంత కక్షలు, ప్రయోజనాలు వున్నాయి. మాదాల జానకి రాంకు ఆనం సంజీవ రెడ్డి అంటే సరిపడదు.

కొరవ 8 పేజీలో

# సారామాని గంజాయి సేవనం- పేదల బ్రతుకుల్లో మత్తు శాపం!

మద్యపాన నిషేధ అనంతరం రాపూరు మందు బాబులు గంజాయి దమ్ముపై ఎక్కువ మక్కువ చూపుతున్నారు. ఈ వ్యాపారానికి కడప జిల్లా వాసులు కొంతమంది యువతులను ఎంచుకొని, వారి ద్వారా నిరాటంకంగా సాగిస్తున్నారు. గంజాయిని పాత పద్ధతులలో కాకుండా సిగరెట్ల లోని ఆ ఖారీని పొగాకును తీసేసి సగం గంజాయితో నింపి

## జిల్లా వార్తలు

అమ్మకాలు సాగిస్తున్నారు. ప్రస్తుతం రాపూరు, సైదాపురం మండలాల్లో ఈ సిగరెట్ పెట్టెల వ్యాపారం జోరుగా సాగిపోతూంది. అసెంబ్లీ ఎన్నికల్లో కడప జిల్లా నుండి మారణా యుధాలు రాకుండా చెక్‌పోస్ట్ రోడ్డులో చెక్‌పోస్టును పోలీసులు ఏర్పాటు చేశారు. ఆ రోజుల్లోనే కడప జిల్లా వాసులు సంచుల నిండా గంజాయితో పట్టుబడ్డారు. ఎన్నిక లయ్యాక చెక్‌పోస్టు తీసి వేయడంతో ఈ వ్యాపారం చేసే వారికి ఏ అడ్డంకులూ లేకుండా పోయాయి. మద్య ప్రియులు గంజాయి వైపు మొగ్గు చూపడంవల్ల రాబోయే రోజుల్లో వారంతా మానసిక దౌర్బల్యు లయ్యే ప్రమాదం వుంది. గంజాయి సేవనం సారాయి కంటే ప్రమాద కరమైన వ్యసనం. పేదల బ్రతుకులకొక శాపం. విషవ్యాపారం విస్తరించక ముందే ఎక్సైజ్ అధికారులు తమ నిద్ర మత్తును వీడాలి. దాడులు అధికం చేయడమే కాకుండా, చెక్‌పోస్ట్ రోడ్డులో మళ్లీ చెక్‌పోస్టును ఏర్పాటు చేయడం ద్వారా సగం స్మగ్లింగ్‌ను నిరోధించ వచ్చు.

### అశ్విని పేరుతో కావలి ఆర్‌టిసి దోపిడి!

తమ డిపోలో తిరిగే బస్సులకు అందమైన పేర్లు పెట్టి ఇంతకు ముందు తిరుగుతున్న బస్సులను ఆపేసి ప్రయాణీకులను కావలి డిపో అధికారులు ఘరానా దోపిడి చేస్తున్నారు. కావలి డిపో నుండి నెల్లూరుకు 44 సీట్లు గల ఆర్టీసి బస్సులను అశ్విని సర్వీసు పేరుతో తిప్పుతున్నారు. ఈ సర్వీసులు కావలి నుండి బయలుదేరి తిప్ప, రాజుపాళెం స్టేజీల్లో ఆగి నెల్లూరు ఆత్మకూరు బస్టాండులో ప్రయాణీకులను దింపి వస్తాయి. కాని ఈ బస్సుల్లో ఎక్స్‌ప్రెస్ బస్సులను మించి ఛార్జి వసూలు చేసి ప్రయాణీకుల జేబుల్ని కొల్లగొడుతున్నారు. ఎక్స్‌ప్రెస్ సర్వీస్‌లలో కావలి నుంచి నెల్లూరుకు పన్నెండు రూపాయలు వసూలు చేస్తారు. అదే ఛార్జితో ప్రయాణీకులు నెల్లూరు ఆర్టీసి డిపో వరకు వెళ్లవచ్చు. అంతే కాకుండా ఈ సర్వీసులు తిప్పలో ఆగవు. రాజుపాళెంలో ప్రయాణీకులు ఆపితే ఆపుతారు కాని డబుల్ స్టాపింగ్‌లలో ఆగే అశ్విని సర్వీసుల్లో 14 రూపాయలు ముక్కు పిండి వసూలు చేస్తున్నారు. కావలి నుండి నెల్లూరుకు ఇంతకు ముందు నాన్‌స్టాప్, సింగిల్ స్టాప్ సర్వీసులు నడిచేవి. ఇందులో 12 రూపాయలే ఛార్జి వుండేది. విజయ వంతంగా నడిచే ఈ బస్సులను కారణం లేకుండా రద్దు చేసి, అశ్విని సర్వీసులు ప్రవేశ పెట్టారు. తిరిగ్గా ఒకటిన్నర గంటలో గమ్యస్థానం చేరుస్తూ సూపర్

కొరవ 12 పేజీలో

## నెల్లూరు పాలిటిక్స్

విమర్శకుడు

### జనార్ధన రెడ్డి

రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు, ...శ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి ...ర్ధన రెడ్డి 1 తేది మద్రాసు ...దుగా వాకాడు వస్తారు. 2 తేది ...ర్యాహ్నం వరకు గూడూరులో ...టారు; తర్వాత వాకాడు. 3 తేది ...కటగిరి, చుట్టుప్రక్క గ్రామాలు ; 4 ...ది నెల్లూరు వస్తారు. 5 తేది కూడా ...్లాలోనే వుంటారు. 6 తేది తిరిగి ...ద్రాసు మీదుగా హైదరాబాదు.

జిల్లాలో కాంగ్రెస్ ...దులందరినీ స్థానిక సంస్థల ...్నికలకు ఉత్సాహ పరచడం ఈ ...ర్యటన ఉద్దేశ్యం.

### కలెక్టర్ బదలీ?

కలెక్టర్ శ్రీ సాంబశివరావు ...లన్నర విదేశీ పర్యటన తర్వాత 23 ...న వచ్చి తిరిగి జాయినయ్యారు.

అయితే ఆయన్ను బదలీ ...యడానికి ప్రభుత్వం నిర్ణయం తీసుకున్నారన్న వార్త ఒకటి వినబడు తున్నది. ఒక యువ లేడి ఐఎఎస్ అధికారిణిని ఇక్కడ నియమించ డానికి ఎంపిక జరిగిందని చెప్తున్నారు.

సాంబశివ రావుగారు నెల్లూరు వదలి వెళ్లారంటే చేదు మాత్ర మింగినట్లు వుంది. ఆయన వంటి స్నేహ పాత్రుడు, సౌమ్యుడైన అధికారిని వదలు కోవలసి రావడం నెల్లూరు దురదృష్టం. జిల్లా ఎమ్మెల్యేలు ప్రభుత్వంపై వత్తిడి తెచ్చి ఈ బదలీ యత్నాన్ని నిలువరించ గల్గితే ప్రజలు సంతోషిస్తారు.

### జాయింట్ కలెక్టర్

జాయింట్ కలెక్టర్ శ్రీ సతీష్ చంద్ర 23 తేది కర్నూలు వెళ్లిపోయారు. ఆయన స్థానంలో జెసి ఎం.ఆర్. నాయక్ ఛార్జి తీసుకొన్నారు. నాయక్ గారు తాసిల్దారు నుంచి అంచెలంచెలుగా ప్రమోషన్లు పొంది వచ్చిన వ్యక్తి; అనుభవ శీలి. పని తీరెట్లుంటుందో చూసి చెప్తాము.










### వేమారెడ్డి తెలుగుతీర్థం స్వీకరణ

పాతికేళ్లుగా కాంగ్రెస్ పార్టీని అంటి పెట్టుకుని వుండి, జిల్లాలో జనార్ధన రెడ్డి తర్వాత తానే పార్టీకి పెద్దగా గుర్తింప బడుతూ వచ్చిన వేమారెడ్డి రామచంద్రా రెడ్డిగారు ఈ ముసలి వయస్సులో కాంగ్రెసుకు, నమ్మిన స్నేహితుడికి నమ్మక ద్రోహం చేసిన వ్యక్తిగా చెడ్డపేరు తెచ్చుకొని తెలుగుదేశం తీర్థ సేవనం చేశారు. 26 తేది హైదరాబాదులో వెంకటగిరి ఎమ్మెల్యే శ్రీ యాచేంద్ర తోడుగా, ఎన్టీఆర్‌ను కలిసి, పూలదండ వేసి పచ్చ చొక్కా తొడుక్కోవటానికి పర్మిషన్ తీసుకున్నారు. మొదట అనుకొన్న కార్యక్రమం ప్రకారం 30 తేది నెల్లూరులో ఏదో ఒకచోట తన అనుచరులన్న వారందరినీ వెంట బెట్టుకొని అట్టహాసంగా పార్టీ మార్పిడి తంతు జరిపించా లనుకొన్నారు. కాని జిల్లా తెలుగుదేశం ఎమ్మెల్యేలలో, ముఖ్యంగా సోమిరెడ్డి చంద్రమోహన రెడ్డి వైపు నుంచి తన చేరిక పట్ల వ్యతిరేకత వ్యక్తం కావడంతో, ఏదైనా బ్రేక్ పడుతుందని సందేహించి, గుట్టు చప్పుడు కాకుండా గుళ్లో దండల పెళ్లి వలె చేరిపోయారు.

"తెలుగుదేశం పార్టీలో ఏదో పదవు లాశించి చేరడం లేదు ; జనార్ధన రెడ్డి వున్నంత వరకు జిల్లా కాంగ్రెస్‌లో నాకు విలువ వుండదు ; నన్ను బ్రతక నివ్వరు; వెంటాడి వేధిస్తారు. అందువల్లనే తెలుగుదేశంలో చేరుతున్నా" అన్నారు రామచంద్రా రెడ్డిగారు. అయితే నిన్నటి వరకు కాంగ్రెస్‌లో జనార్ధన రెడ్డి ప్రక్కన ఆయనకు పెద్ద పీట; నేటి నుంచి తెలుగు దేశంలో పిల్ల ఎమ్మెల్యేలు, కుర్ర కార్యకర్తల వెనుక లాస్ట్ బెంచ్‌లో సీటు. ఈ తేడాలోని మానసిక అశాంతి ఆయనకు కొంతకాలం గడిస్తే కాని అనుభవం లోకి రాదు.

రామచంద్రా రెడ్డిగారు కాంగ్రెస్ నుంచి బయటకు వెళ్లడానికి దారితీసిన పరిస్థితులు, ఆయన వాదనలోని ఔచిత్యం, జనార్ధన రెడ్డిపై ఆయన వేస్తున్న నిందల్లోని నిజానిజాలు, గూడూరు టిక్కెట్ ప్రహసనం తదితరాలపై ఇప్పటికే పెద్ద రచ్చ జరిగింది; చర్చా జరిగింది. ఇంకా వాటి గురించి మాట్లాడు కోవడం అనవసరం. కాని, ఆ పాతికేళ్లలో రామచంద్రా రెడ్డి గారికి కాంగ్రెస్ పార్టీ, జనార్ధన రెడ్డి చేకూర్చిన ప్రయోజనం, ఆయన వారికి చేసిన దానికంటే చాలా అధికం. ఆ విషయం ఒక్కటి జ్ఞాపకం పెట్టుకున్నా ఆయన ఏ పార్టీలో వున్నప్పటికీ రాజకీయ వాదిగా గౌరవింప బడతారు. అది మర్చిపోయి ప్రవర్తిస్తే కృతఘ్నుడిగా గుర్తింప బడతారు.

రామచంద్రా రెడ్డిగారి నిష్క్రమణ గూడూరు డివిజన్‌లోని పలువురు కాంగ్రెస్ వాదులకు సంతోషం కల్గిస్తున్నది. తమకు పట్టిన గ్రహణం విడిచినట్లు ఫీలౌతున్నారు వారు. కాని ఆయన లేని లోటు కన్పడకుండా ఆ డివిజన్‌లో పార్టీని వ్యవస్థీ కృతం చేయగల్గిన స్థోమత, ఓపిక వుండే నాయకులను తీర్చి దిద్దితేనే ఆ సంతోషానికి అర్థం వుంటుంది.

తరువ 7 పేజీలో

# రిపబ్లిక్ డే మొక్కుబడి

## జనరంజకంగా జరిగింది

పోలీస్ పెరేడ్ గ్రౌండ్‌లో ప్రతి యేడాది మొక్కుబడిగా జరిగి పోయే సర్కారీ రిపబ్లిక్ డే కార్యక్రమంలో ఈ సారి నవ్యత కొట్టొచ్చినట్లు కనబడింది. దేశ, రాష్ట్ర రాజధానుల పెరేడ్‌లలో ప్రదర్శించే మాదిరి అభివృద్ధి శకటాలు నెల్లూరు గ్రౌండ్‌లో కనపడే సరికి ప్రజలు ఆశ్చర్య పోయారు. జిల్లాలో నడయాడుతున్న ప్రగతి రథమంటూ పొదుపు లక్ష్మి, ఆరోగ్య దీపం, సారా నిషేధం ప్రధానాంశాలుగా సాగిన ప్రదర్శన పలువుర్ని ఆకట్టుకొన్నది. సారా పై పోరాటంతో జిల్లాకు ప్రపంచ పటంలో ప్రత్యేక గుర్తింపు తెచ్చిన దూబగుంట రోశమ్మ ముకుళిత హస్తాలతో ప్రగతి రథంలో దర్శన మిచ్చింది. జిల్లాలో చేపట్టిన వుద్యమాల వల్ల మహిళల్లో వచ్చిన చైతన్యానికి నిదర్శనగా వివిధ మండలాల నుంచి తరలి వచ్చిన మహిళలు తాము చేసిన పొదుపు మొత్తాన్ని బ్యానర్లలో ప్రదర్శిస్తూ మానవహారంలా ముందుకు సాగారు. స్వయం ఉపాధి పథకాల వల్ల మారిన తమ జీవన విధానాన్ని కళ్లకు కట్టినట్లు చూపారు. వీరి మధ్య జాతి పిత గాంధీ వేషంతో కలసి నడిచిన ఒక వ్యక్తి చూపరులను ఆకర్షించారు. అయితే పెరేడ్‌లో రిలీఫ్ నర్సింగ్ స్కూల్ విద్యార్థినులు మార్చ్ ఫాస్ట్ చేస్తూ జాతీయ పతాకాన్ని తలక్రిందులుగా పట్టుకొని ఒకటికి రెండుసార్లు తిరిగినా ఎవరూ నిలువరించ లేదు. క్రొత్తగా ఎమ్మెల్యేలైన తెలుగు తమ్ముళ్లలో ఆత్మకూరు కొమ్మి లక్ష్మయ్య నాయుడు

మహిళలు ఎక్కువ సంఖ్యలో పెరేడ్ గ్రౌండ్‌లో కనపడి జిల్లాలో చైతన్యానికి తాము ప్రతీకలమంటూ చాటారు.

పోలీస్ గౌరవ వందనాన్ని స్వీకరించి ఎస్పి జె. పూర్ణచంద్ర రావు వెంట రాగా జాతీయ పతాకాన్ని ఆవిష్కరించిన కలెక్టర్ ఎం. సాంబశివ రావు జిల్లా అభివృద్ధి పై అనర్గళంగా మాట్లాడారు. అక్షరాస్యత, సారా

ఒక్కడే ప్రముఖుల వరుసలో ఆశీనులై వుండారు. ఎప్పుడూ లేనంతగా నిషేధం, పొదుపు లక్ష్మి వంటి పథకాలతో దేశంలోనే జిల్లా ప్రత్యేక స్థానం పొందింది. ఎన్నికల కమీషన్ నిర్దేశించిన మార్గదర్శక సూత్రాలలో ఏ విధమైన అవాంఛనీయ సంఘటనలు జరగకుండా ఎన్నికలు జరిపించినట్లు చెప్పారాయన. సంపూర్ణ మద్య నిషేధం పకడ్బందీగా అమలు చేసేందుకు జిల్లా, మండల స్థాయి కార్యాచరణ కమిటీలు ఏర్పాటు చేయనున్నట్లు వివరించారు. పొదుపు లక్ష్మి పథకం వల్ల నెల్లూరుజిల్లా దేశంలోనే గాక అంతర్జాతీయంగా కూడా గుర్తింపు పొందింది. ఆరు కోట్ల రూపాయలను రెండు లక్షలా ఆరు వేల మంది గ్రామీణ మహిళలు పొదుపు చేసి దేశానికి ఆదర్శ ప్రాయులయ్యారని వివరించారాయన. అందరికీ విద్య అందించాలనే లక్ష్య సాధన కోసం ఈడుగల బాల బాలికలందరినీ బడిలో చేర్పించే 'పోదాం బడికి' కార్యక్రమానికి జిల్లా ఎంపికైనట్లు హర్షధ్వానాల మధ్య ప్రకటించారు.

సోమశిల ప్రాజెక్ట్ పనులు పూర్తి చేసేందుకు అవసరమైన 70 కోట్ల రూపాయలను మూడు దఫాలుగా ఇచ్చేందుకు ప్రభుత్వం అనుమ

తిచ్చిందని, రూపేకరణకు 27 కోట్లు మంజూరైనట్లు కలెక్టర్ చెప్పారు.

జిల్లాలో వుత్తమ సేవలందించిన వివిధ శాఖలకు చెందిన 71 మందికి విశిష్ట సేవా పతకాలను కలెక్టర్ ఈ సందర్భంగా అందించారు. వీరిలో తుఫాన్లు, భారీ వర్షాల సమయంలో పునరావాసం కల్పించడంలో విశిష్ట సేవలందించిన కలెక్టర్ కార్యాలయంలోని సూపరిం టెండెంట్ రాళ్లపల్లి రామ సుబ్బారావు ముఖ్యులు. పెరేడ్‌లో మహిళా కార్యక్రమాలు విజయవంత మయ్యేందుకు డ్వాక్రా పథకం ప్రత్యేక అధికారిణి విజయ భారతి బాగా కష్టపడ్డారు.

## జనవాణి

3వ పేజీ కొరవ

ప్రధానులైన వారిలో మొరార్జీ దేశాయ్ మినహా అందరూ ఉత్తర ప్రదేశ్ నుండి వచ్చిన వారే. దక్షిణాది నుంచి తొలిసారిగా ఎన్నికైన పివి నరసింహా రావును దక్షిణాది నాయకుడైన రామ్మూర్తి అర్జున్ సింగ్‌తో కలసి విమర్శించడం తగదు.

నెల్లూరు - టి.వి.నారాయణ

### జిల్లా పేరు మార్పు అనవసరం

13 తేది జమీన్‌రైతు జనవాణి శీర్షికలో శ్రీరాములు జిల్లాగా ఎందుకు మార్చాలి అనే విషయాన్ని ఎల్. రామ సుబ్బయ్య చక్కగా విశదీకరించారు. ఇది కేవలం కొంతమంది చేస్తున్న రాజకీయ రగడ తప్ప మరొకటి కాదు. బాషా ప్రయుక్త రాష్ట్రాలకు శ్రీకారం చుట్టిన అమర జీవి శ్రీరాములు గారిని ప్రభుత్వం సముచితంగా గౌరవిస్తూ వారి వర్ధంతికి రాష్ట్రం యావత్తూ 2 నిమిషాలు మౌనం పాటిస్తున్నారు. హైదరాబాదు సెక్రటేరియట్ ముందు శ్రీరాములు గారి నిలువెత్తు విగ్రహాన్ని ప్రతిష్టించారు. నెల్లూరులో అయితే నూతనంగా నిర్మిస్తున్న ఆత్మకూరు బస్టాండుకు పొట్టి శ్రీరాములు బస్టాండుగా నామకరణం చేయడం జరిగింది. రాష్ట్రంలో అనేక ప్రాంతాల్లో ఆయన విగ్రహాలు ప్రతిష్టించి భక్తి శ్రద్ధలు చూపిస్తూనే వున్నారు. అంతేగాని జిల్లా పేరు మార్పు చేయునవసరం సమంజసం కాదు. ఇప్పటికే కొన్ని జిల్లాల పేర్లు మార్పు చేసి చరిత్ర గతులు చెరిపేశారు. ఈ విధంగా జిల్లాలకు, రాష్ట్రాలకు వ్యక్తుల పేర్లు పెడుతూ పోతే భవిష్యత్తులో పురాతన పేర్లు కనపడకుండా పోతాయి. నెల్లూరు అనేది పామరులకు సైతం ఉచ్చారణలో చాలా సులువుగా వుందనే విషయం మరువ కూడదు.

కావలి - ఇ.పిచ్చయ్య చౌదరి

### అప్రెంటిస్‌లకు అన్యాయం

ఐ.టి.ఐ. అయిన తరువాత వివిధ సంస్థలలో పని నైపుణ్యం కోసం రెండు సంవత్సరాలు అప్రెంటిస్‌గా చేయుచుంటారు. ఈ కాలంలో 610 రూపాయలు స్టైఫండ్ ఇస్తారు. వివిధ రకాల పనులను వీరిచేత చేయించు కుంటారు. ముఖ్యంగా ఆర్టీసిలో అప్రెంటిస్‌లను హీనంగా చూస్తున్నారు. అప్రెంటిస్‌గా పనిచేసిన వెంటనే ఆ సంస్థలలోనే పర్మినెంట్ చేసి ఉద్యోగాలిస్తే నిరుద్యోగులకు పూరడింపుగా వుంటుంది.

సంగం - పొట్ల శ్రీహరి

నెల్లూరు ముచ్చట్లు
6 పేజీ కొరవ

### చదలవాడ వెంకటేశ్వర్లు మరణం

గూడూరు తాలూకాలో ప్రముఖ కాంగ్రెస్ నాయకుడు శ్రీ చదలవాడ వెంకటేశ్వర్లు నాయుడు 25 తేది వెంకటాచలం మండలం ఎర్రగుంట వద్ద కారు ప్రమాదంలో అత్యంత విషాద కరంగా మరణించారు. నెల్లూరు నుంచి గూడూరుకు మారుతి కారులో, తానే డ్రైవ్ చేస్తూ వెళ్తుండినారు. లారీ ఒకటి హఠాత్తుగా ఎదురు వచ్చి గుద్దేసింది. కారు నుజ్జు నుజ్జు అయిపోయింది. వెంటనే ఆస్పత్రికి తరలించ డానికి ప్రయత్నించారు కాని, మధ్యలోనే ప్రాణం పోయింది.

వెంకటేశ్వర్లు కష్టజీవి. చెన్నూరులో సాధారణ రైతు కుటుంబీకుడైన ఆయన స్వయం శక్తితో పెద్ద వ్యాపార వేత్తగా ఎదిగారు. మొదటి నుంచి కాంగ్రెస్ పార్టీనే నమ్ముకొని వుండినారు. గూడూరు టౌన్‌లో కాంగ్రెస్ సభ లన్నింటితో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సంబంధం వుండినా ఎప్పుడూ పదవు లాశించలేదు. నెమ్మదస్తుడు, మితభాషి. వివాదాల జోలికి వచ్చేవాడు కాదు. మృత్యువు ఆయన్ను ఈ రూపంలో కబళించడం విషాదకరం.

జిల్లా స్థాయి గుర్తింపు కల్గిన కాంగ్రెస్ వాది, కాళహస్తిలో మొన్న పోటీ చేసి ఓడిపోయిన చదలవాడ కృష్ణమూర్తి ఆయన సోదరుడు. కృష్ణమూర్తి గారికి గత ఐదారేళ్లుగా కుటుంబ జీవితం విషాద భరితంగా వుంది. చేతికంది వచ్చిన కుమారుడ్ని, తోడుగా వుండిన భార్యను ఆయన పోగొట్టు కున్నారు. ఆ దుఃఖం నుంచి పూర్తిగా తేరుకోక ముందే పెద్ద అండగా వుండిన అన్న వెళ్లిపోయారు. వారి కుటుంబాన్ని ఏ సానుభూతి వచనాలూ ఓదార్చలేవు.

### 70 మంది ఖైదీల విడుదల

తన ధర్మపత్ని లక్ష్మీపార్వతి ముద్దుల కోరిక మీద ఎన్టీఆర్ ప్రకటించిన క్షమాభిక్ష మేరకు నెల్లూరు జిల్లా జైలునుంచి 70 మంది ఖైదీలు విడుదలైనారు. వీరంతా 60 సంవత్సరాల వయస్సు పైబడిన వారే. విడుదల కాగానే ఒక ఖైదీ పొగతోటలో రోడ్డ నిలబెట్టి వుండిన స్కూటర్‌ను దొంగిలించి గుంటూరు వెళ్తుండినాడట. కాని వెంకటేశ్వర పురం దగ్గర పోలీసుకు పట్టుబడి, మళ్లీ జైలుకు వెళ్లాడు.

బయటకు వచ్చిన ఈ దొంగల బెడదతో పౌరులు ఎన్ని సమస్య లెదుర్కోవలసి వుంటుందో!

### శ్రీధర్‌కు రైల్వే సభ్యత్వం

యూత్ కాంగ్రెస్‌లో మరుపైన వ్యక్తి, మాజీ పిసిసి అధ్యక్షుడు శ్రీ హనుమంత రావుకు 'రామభక్త హనుమాన్' కోటంరెడ్డి శ్రీధర్ రెడ్డిని దక్షిణ మధ్య రైల్వే వినియోగ దారుల సలహా సంఘ సభ్యుడిగా నియమించారు. రెండేళ్లు వుంటుంది సభ్యత్వం.



# In the Court of Sub Judge : Nellore

E.P. 72 / 93 : :O.S. 115 / 79

State Bank of India, Kovur rep. by its Manager
- Petitioner /D.Hr.

Vs

Basireddy Ramana Reddy
- Respondent /J.Dr.

**SCHEDULE**

The following are the schedule properties belonging to the respondent will be auctioned on 13.2.95 between 10 A.M. and 5 P.M. before the court premises. The intending bidders may participate in the said auction.

**ITEM 1:** Nellore Dist. registration, Nellore taluk, Indukurpeta sub registration, Koduru panchayat, Kodur Village S.No. 168/2, Ac. 0.32 of wet land on the western side out of Ac. 1.22 or 0.488 Hec, in Bit - I village Koru patta No. 104 bounded by East: Land of Patur Ramanareddy situated in the S.No. 168/A2; South: Land of Basireddy Kameswaramma upto some extent and land of Pamuru Ramana Reddy got under exchange to some extent; West: Thotakura Dharmaiah's land.

Value of D.Hr. Rs. 3,200/-
Value of Amin Rs. 12,900/-

**Item 2:** Nellore Dist. regn. Nellore taluk, Indukurpeta sub registration, Koduru Panchayat, Kodur village 0.11 1/8 cents or 0.441/2 Hec. on the western side out of 0.32 cents in S.No. 168/A3 bounded on East: Ponnuru Ramanareddy's land; West: Basireddy Kameswaramma's land; North: Ponnuru Ramana Reddy's land got under Exchange with in these boundaries Ac. 0.11 1/8

Value of D.Hr. Rs. 1,200/-
Value of Amin Rs. 4,450/-

**Item 3:** Nellore Dist. registration, Nellore taluk, Indukurpeta sub regn. Koduru panchayat, Koduru village Bit - 1, Patta No. 31, S.No. 174, extent 0.243/4 cents of wet land out of Ac. 1.99 of land bounded on East: Thotakura Gopalaiah's land in S.No. 174; South: Thota kura Gopalaiah and Chenneti Subbamma's land in S.No. 174 West: Bathala Parvathamma's land; North: Asalu minaha kalva with in these boundaries Ac. 0.243/4 or 0.098 Hc

Value of D.Hr. Rs. 2,500/-
Value of Amin Rs. 8,650/-

**Item 4:** Nellore Dist. registration, Nellore taluk, Indukurpeta sub regn. Koduru panchayat, Koduru village Patta No. 31, S.No. 174, an extent of 0.131/2 or 0.044 Hec. of wet land out of Ac. 1.99 of land bounded on East: Bathala Parvathamma's land; South & West: Land in S.No. 175/2; North: Asalu minaha kalva with in these boundaries Ac. 0.131/2 or 0.044 Hc.

Value of D.Hr. Rs. 1,400/-
Value of Amin Rs. 4,725/-

**Item 5:** Nellore Dist. registration, Nellore taluk, Indukurpeta sub Regn. Koduru panchayat, Koduru village Koru patta No. 258 S.No. 175/2B an extent of 0.283/4 or 0.115 Hec. of wet land out of 0.99 cents bounded on East: Land in S.No. 174; South & West: Irrigation channel; North: Asalu minaha kalva with in these boundaries 0.281/2 or 0.115 Hc

Value of D.Hr. Rs. 2,900/-
Value of Amin Rs. 10,000/-

**Item 6:** Nellore Dist. registration, Nellore taluk, Indukurpet Sub regn. Koduru village, S.No. 172/E an extent of 0.061/4 cents or 0.025 Hec. out of 0.30 cents of wet land bounded on East: Land in S.No. 171/B2; South & North: Thotakura Dharmaiah's land; West: Irrigation channel with in these boundaries Ac. 0.061/4 or 0.025 Hc.

Value of D.Hr. Rs. 650/-
Value of Amin Rs. 2,500/-

**Item 7:** Nellore Dist. registration, Nellore taluk, Indukurpet sub regn. Koduru panchayat, Koduru village, S.No. 171/B2 an extent of 0.241/2 or 0.105 Hec. of wet land out of 0.93 cents bounded on East: Thupili Subbarami Reddy's land; South: Thotakura Dharmaiah's land; West: Irrigation Channel; North: Valluru Subbarami Reddy's land with in these boundaries Ac. 0.241/2 or 0.105 Ac.

Value of D.Hr. Rs. 2,500/-
Value of Amin Rs. 9,700/-

**Item 8:** Nellore Dist. registration, Nellore taluk, Indukurpet sub regn. Koduru panchayat, Koduru village an extent of 0.083/4 cents or 0.035 Hec. of wet land out of 0.93 cents bounded on East: Ponnuru Ramanareddy's land; South & North: Thotakura Dharmaiah's land; West: Land belonging to Basireddy Ramanareddy got under saledeed dt. 30.3.54 with in these boundaries Ac. 0.083/4 or 0.035 Hc

Value of D.Hr. Rs. 850/-
Value of Amin Rs. 3,500/-

**Item 9:** Nellore Dist. registration, Nellore taluk Indukurpet sub regn. Koduru panchayat, Koduru village Koru Patta No. 31, S.No. 170/C extent: 0.091/2 or 0.037 Hec. of wet land out of 0.80 cents bounded on East & North: Land of Thotakura Gopalaiah; South: Land of Thotakura Dharmaiah with 1/4th share in the laterite stone wall constructed in 0.83 cents in S.No. 170/C with in these boundaries Ac. 0.091/2 or 0.037 HC

Value of D.Hr. Rs. 900/-
Value of Amin Rs. 3,325/-

Item: 10

Nellore Dist. registration, Nellore taluk Indukurpet Sub regn. Koduru panchayat, Koduru village Patta No. 39, Ac. 2.34 of wet land of as follows:

| S.No. | Extent |
| --- | --- |
| 384/1 | 2.39 |
| 384/2 | 7.19 |
| 389/3 | 1.58 |
| 397/A | 1.52 |
| 399/B | 0.53 |
| 392/A | 0.24 |
| 397/B | 0.53 |
| Total Ac. | 18.35 |

which has the north of Ac. 10.60 or 4.140 Hec. of Koduru Gopalaiah with standing crop therein.

Value of D.Hr. Rs. 8,350/-
Value of Amin Rs. 18,000/-

Kovur W. Subrahmanyam
Dt. 18.1.95 Advocate

# నటుడుగా నేను రామారావు గారి అభిమానిని!



మాయాబజార్ చిత్రంలో దాసరి నారాయణరావుతో అక్కినేని

### అక్కినేని చెప్పిన నిజం

ఎన్టీఆర్, ఎఎన్ఆర్ సమకాలికులే కాదు, మంచి మిత్రులు; రాజకీయాల్లోకి వచ్చిన తర్వాత బద్ధ శత్రువులై మళ్ళీ గత వారమే మనసు విప్పి మాట్లాడుకొని దగ్గరయ్యారు. పై విషయాలు మామూలువే. ఆశ్చర్య పడనక్కర లేదు. కాని హైదరాబాద్ లోని కిన్నెర ఆర్ట్ థియేటర్ వారు జనవరి 11 తేది 'అరవై యేళ్ల తెలుగు సినిమా' పేరుతో తెలుగు సినీ పరిశీలకులు, విమర్శకులు రాసిన వ్యాసాల సంకలనాన్ని ఆవిష్కరించిన సభలో ఎఎన్ఆర్ తన మనసులో మాట వెల్లడించారు. అప్పట్లో ఆజాను బాహుడైన ఎస్వీ రంగారావు వాచకానికి, అహార్యానికి ఎదురు నిలబడి తనదైన నటనతో ఎన్టీఆర్ తన ప్రత్యేకతను సాధించారు. అందుకే నాలాంటి వాడు రామారావు గారి అభిమాని కావడం జరిగిం దన్నారు. నేటి సినిమాల గూర్చి చెబుత కాలక్రమేణ సినిమా పరమావ మారింది. గూండాలూ, రౌడీలే నే కథా నాయకుల పాత్రలై పోయాయి. పాటల్లో వాళ్ల నడుములు, తదిత భాగాలు చూపే విధానం చూస్తుంటే సినిమా తీసే విధానం, ప్రేక్షకుల అభిరుచి ఎటు పోతున్నా యనిపిస్తోంది అన్నా రాయన. ఈ కార్యక్రమంలో రాష్ట్ర మంత్రులు ఎ.మాధవ రెడ్డి, దాడి వీరభద్ర రావు, డాక్టర్ సి.నారాయణ రెడ్డి, సీనియర్ జర్నలిస్ట్ ఇంటూరి వెంకటేశ్వర రావు, ఐఎఎస్ అధికారి కెవి రమణ తదితరులు పాల్గొన్నారు.

# అంత పెద్ద హీరో పంపిణీదారుడైనాడు!

నటించడం మానేశాక సూపర్ స్టార్ అమితాబ్ బచ్చన్ కొత్త అవతారం ఎత్తారు. సినిమా పంపిణీ దారునిగా మారాడు. మణిరత్నం తాజాగా నిర్మించిన బాంబే హిందీ వెర్షన్‌కి హక్కులు కొన్నారు. విడుదలకు ముందే ఈ చిత్రం సంచలనం సృష్టిస్తున్నది. విడుద లయ్యాక ఈ మాజీ స్టార్‌పై కాసుల వర్షం కురిపిస్తుందేమో! అయినా అమితాబ్ వంటి గొప్ప నటుడు పంపిణీ దారునిగా మారడమే చర్చనీయాంశం.

### మంచి సినిమా 'హమ్ ఆప్‌కె హై కౌన్'

గత ఏడాది విడుదలైన హిందీ చిత్రం 'హమ్ ఆప్‌కె హై కౌన్' దేశంలోనే అత్యంత ప్రజాదరణ పొందిన చిత్రమని చెప్పవచ్చు. మొదట 30 థియేటర్లలో మాత్రమే విడుదలై తర్వాత వందలాది థియేటర్లలో విజయవంతంగా ప్రదర్శింప బడుతోంది. రాష్ట్రపతి, ఆయన సతీమణి తోపాటు పార్లమెంట్ సభ్యులందరూ ఈ చిత్రాన్ని ప్రత్యేకంగా చూశారు. చూస్తే ఆశ్చర్య పోనక్కర లేదుగాని సినిమా సాగే సమయంగూర్చి వింటే అబ్బుర పోతాం. ఈ సినిమా 3 గంటల 27 నిమిషాల పాటు సాగినా బోర్ కొట్టదు. 152 క్యారెక్టర్లు ఈ సినిమాలో వున్నాయంటే ముక్కున వేలేసుకొంటాం. పాటలు అంతే ; ''దీదీ తెరా దేవర్ దీవానా'' పాట జీ టివి ఫిలిప్స్ టాప్ టెన్‌లో మొదటి స్థానంలో గత కొన్ని నెలలుగా నిలచి చిత్రం సత్తాను చాటుతోంది. త్వరలోనే ఈ చిత్రం తెలుగులోకి డబ్ చేయబడుతుంది.

### కమలహాసన్ దర్శకుడయ్యాడు!

జాతి గర్వించ దగ్గ నటుడు కమల్ హాసన్ దృష్టి కొన్నాళ్లుగా దర్శకత్వపు శాఖపై పడివుంది. ఆయనే స్వయంగా తన బ్యానర్ రాజ్ కమల్ ఇంటర్నేషనల్‌పై ఒక చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఈ చిత్రంలో శివాజీ గణేషన్ నటిస్తుండడమే ప్రముఖాంశంగా చెప్పవచ్చు. లోగడ

### చిత్రవార్తలు

వీరిద్దరూ కలిసి నటించిన క్షత్రియ పుత్రుడు చిత్రం శివాజీకి జాతీయ అవార్డు తెచ్చి పెట్టింది.

### శోభన్‌బాబు నిర్ణయం!

శోభన్‌బాబు 25 ఏళ్లుగా హీరోగా కొనసాగుతున్నా పరిశ్రమలో భేషజం లేని వ్యక్తిగా పేరు. హంగామాలకు బహు దూరంగా వుంటారు. ఆయన తన పుట్టిన రోజుని దొరబాబు సినిమా షూటింగ్‌లో అరకు లోయలో ఈసారి జరుపు కొన్నారు. ఈ సందర్భంగా తన మనసులో దాగివున్న నిర్ణయాలు బహిరంగ పర్చారు. జీవితంలో కొంతకాలం వరకు నిలచిపోయే కొన్ని కార్యక్రమాలు చేయాలని వుంది. ఎప్పుడు, ఏమిటి, ఎలా అన్నది ఆలోచిస్తున్నాను. మా 'శాంతి నికేతన్' లో అనాథ బాలల కోసం వసతిని ఏర్పరచి దానిని మదర్ థెరిస్సాకు అంకిత మివ్వాలని నా కోరిక. సంస్థ నిర్వహణ బాధ్యతను మదర్ థెరిస్సా ఆర్గనైజేషన్ క్రిందకు తీసుకొని రావాలను కొంటున్నట్లు చెప్పాడాయన. బెస్ట్ ఆఫ్ లక్!

### విజయశాంతి ది గ్రేట్!

లేడీ సూపర్ స్టార్‌గా కీర్తించబడే విజయశాంతికి ఇటీవల తెలుగులో సినిమాలు తగ్గినా తమిళం, హిందీలో సూపర్ హిట్లు ఆమె ఇమేజ్‌ను మరింత పెంచాయి. దేశంలోనే అత్యధిక పారితోషికం తీసుకొనే హీరోయిన్‌గా విజయశాంతి పాపులారిటీ సంపాదించింది. ఈ విషయాన్ని మరో టాప్ హిందీ నటి మాధురీ దీక్షిత్ వెల్లడించడమే విశేషం. టాప్ హీరోలతో సమానంగా విజయశాంతి పారితోషికం వుంటుందని విని ఆనంద పడుతున్నాను. ఈ విషయం రియల్లీ గ్రేట్ అంది ముసిముసి నవ్వులతో ఇటీవల మద్రాసులో మాధురి.

### మళ్లీ హిందీలో కమల్ నాయకన్

తెలుగులో నాయకుడుగా డబ్బింగ్ చేయబడ్డ నాయకన్ తమిళ చిత్రాన్ని దయావన్ పేరుతో హిందీలో

కొంద 10 పేజీలో

# మిస్ కాకూడని చిత్రం

# మిస్ 420

### చిత్రసమీక్ష
గ్రిద్దలూరు గోపాలరావు

కొంతవరకైనా మంచి చిత్రాలను రూపొందించడంలో అంకిత భావం, ఆరాధ్య విధానం గల దర్శకునిగా మౌళిని చెప్పుకోవచ్చు. ఇటు నిర్మాతకు,అటు ప్రేక్షకులకు న్యాయం చేకూర్చే ప్రయత్నం సాగిస్తుంటా రాయన. అంతే కాదు తన చిత్రంలోని నటీ నటులకు, సాంకేతిక నిపుణులకు చక్కటి గుర్తింపు సాధించి పెట్టాడు. ఉదాహరణకు చూడండి పరుగు పందాల్లో ప్రథమ శ్రేణిలో వెలుగొందుతున్న అశ్వనీ నాచప్పను అది పనిగా పట్టుబట్టి సినిమా రంగంలోనూ ప్రముఖ ఏక్షన్ హీరోయిన్‌గా తీర్చిదిద్దారు.

కథను ఎన్నుకోవడంలోనూ, మాటలు వ్రాయించడంలోనూ ఎంతో శ్రద్ధ చూపుతాడు మౌళి. చాలా వరకు కథలో కొత్తదనం కనుపరుస్తాడు. మాటల్లో అన్ని రసాలను సమకూరుస్తాడు. ఇక పాత్రలను కదిలించడంలోనూ, సన్నివేశాలను సృష్టించటంలోను, మొత్తం చిత్రానికి జీవత్వం కల్పించడంలోనూ ఆయన సమర్థత వెల్లడిస్తాడు. ఇంతటి దీక్షా దక్షతతో తయారు చేయబడే చిత్రాలు ఆసక్తి దాయకంగా వుండి ప్రేక్షకులను ఎలా ఆకట్టు కోకుండా వుంటాయి?

మౌళి దర్శకత్వంలో తాజాగా రూపొందించిన ''మిస్420'' చిత్రం ఆదినుంచి అంతం వరకు మంచి ఊపుతో సాగుతుంది. ఎందుచేతనంటే పైన చెప్పిన హంగులన్నీ ఈ చిత్రానికి బాగా అమరాయి కాబట్టి.

కథకూడా మౌళి వ్రాశారు. అన్నాజీ (కోట శ్రీనివాసరావు) చిన్నాజీ (తనికెళ్లభరణి) అనే ఇద్దరు అన్నదమ్ములు ఆ ఊళ్లో నరభక్షకులుగా విహరిస్తుంటారు. వీరి దుర్మార్గాలను తిరికట్టేందుకు నీతిపరుడైన సుందర రామమూర్తి (మౌళి) ప్రయత్నిస్తాడు. తన కూతుర్ని (అశ్వనీ నాచప్ప) ఐ.ఏ.ఎస్. పాస్ చేయించి కలెక్టరుగా రప్పించి అన్నాజీ, చిన్నాజీల ఆట కట్టించా లనుకుంటాడు. కానీ బస్తీలో ఒక మోసగాని చేతిలో చిక్కుకొని కూతురు చిన్న చిన్న నేరాలు చేస్తూ '' మిస్

కొంద 10 పేజీలో

# నెల్లూరు సంగతులు

4 పేజీ తరువాయి

మెడికల్ సూపరింటెండెంట్ డాక్టర్ దేవరాశ్ ఫూలా చెప్పారు. జిల్లా ప్రజలకు ఎంతగానో వుపయోగ పడే విభాగాన్ని డాక్టర్ వాల్టర్ హార్టర్ దంపతులు స్వయంగా తమ చేతుల మీదుగా ప్రారంభించారు. జిల్లా కలెక్టర్ ఎం.సాంబశివ రావు అపురూపమైన సహాయం చేసిన దంపతుల సేవా నిరతిని కొనియాడారు. ఈ నేత్ర విభాగానికి డాక్టర్ గోవర్ధన్ రెడ్డి అధిపతిగా వుంటారు.

## జర్నలిస్ట్ కాలనీ క్రికెట్ క్లబ్ విజయం

భారత ప్రజాతంత్ర యువజన సమాఖ్య (డివైఎఫ్ఐ) నిర్వహించిన జిల్లా స్థాయి క్రికెట్ టోర్నమెంట్‌లో నెల్లూరు జర్నలిస్ట్ కాలనీ క్రికెట్ క్లబ్ విజయం సాధించింది. పోటీలు ఈనెల 12 తేది నుండి 25 వరకు ఎసి సుబ్బారెడ్డి స్టేడియంలో జరిగాయి. పోటాపోటీగా జరిగిన మ్యాచ్‌లలో 16 టీములు పాల్గొన్నాయి. ఫైనల్స్‌లో గాయత్రి నగర్ మనోజ్ టీమను 72 పరుగుల భారీ తేడాతో జె.సి.సి. క్రికెట్ క్లబ్ ఓడించి బహుమతిని కైవశం చేసుకొంది. విజయం సాధించిన జట్టుకు తూపిలి విజయ సారధి కెప్టెన్‌గా వ్యవహరించారు. బాబు, అలీం, శివాజీ, రాజా, సాయి, అశోక్, ప్రవీణ్, భరత్, శివ, వాసు, పల్లవ్, రాము టీము సభ్యులు.

## జర్నలిస్ట్ ఎన్నికలు వాయిదా

జిల్లాలో మునిసిపల్, పంచాయతీ ఎన్నికల ఓటర్ల నమోదు జాబితా సజావుగా తయారై పోయింది గాని, జర్నలిస్ట్ సంఘ సభ్యుల తుది జాబితా విషయమై మాత్రం నానా రభస జరుగుతున్నది. సంఘం ఎన్నికలు, మహాసభ అనుకొన్న ప్రకారం 29 తేది జరిగి వుంటే ఆ రచ్చకు బహుశా కలక్షేత్రం కప్పు ఎగిరిపోయి వుండేది. అందువల్లే కాబోలు సమావేశం వాయిదా పడింది. 28 తేది జరిగే కార్యవర్గ సమావేశంలో తదుపరి తేది నిర్ణయిస్తారని యూనియన్ కార్యదర్శి రామ్మోహన్ తెలియ జేశారు.

## సాహిత్యంలో సత్యభామ గ్రంథావిష్కరణ!

29 తేది టౌన్ హాల్‌లో గ్రంథావిష్కరణ సభ జరుగుతుంది. పచ్చిపులుసు వెంకటేశ్వర్లు రచించిన సాహిత్యంలో సత్యభామ గ్రంథాన్ని గూడూరు డి.ఆర్.డబ్ల్యు కళాశాల ప్రిన్సిపల్ డాక్టర్ మిహిరమణి ఆవిష్కరిస్తారు. సభకు సాహితీవేత్త డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి అధ్యక్షత వహిస్తారు. అగస్త్య రెడ్డి వెంకురెడ్డి సమీక్షిస్తారు. యడ్లపల్లి గోవిందు శెట్టి, అమ్మణ్ణమ్మ గారల స్మృతికి అంకితంగా వారి కుమారుడు సుందర రావు ప్రథమ ప్రతిని స్వీకరిస్తారని సమాజం కార్యదర్శి బి.వి. నరసింహాలు తెలియ జేశారు.

## నెల్లూరులో అఖిలాంధ్ర నాటకోత్సవాలు

టౌన్ హాల్‌లో ఈనెల 29 నుంచి 31 వరకు అఖిలాంధ్ర నాటకోత్సవాలను రాష్ట్ర సాంస్కృతిక వ్యవహారాల శాఖ, తెలుగు విశ్వ విద్యాలయం సహకారంతో జిల్లా సాంస్కృతిక మండలి నిర్వహిస్తుంది. రాష్ట్రంలోని నాటక సంస్థలను ప్రోత్సహించేందుకు వీటిని నిర్వహిస్తున్నారు. వేదం వెంకటరాయ శాస్త్రి స్మారకంగా రాష్ట్రంలో నాటకోత్సవాలకు ఈసారి నెల్లూరు ఎన్నికైంది. 29 తేది సాయంత్రం 6 గంటలకు విశాఖ పట్నం కళా తరంగిణి వారి యోగి వేమన నాటకంతో ఈ వుత్సవం మొదలవుతుంది. 30 తేది 'ముల్లు బోయే కత్తి వచ్చె ధామ్ ధామ్' హైదరాబాద్ వారిచే సంధ్య ఛాయ సాంఘిక నాటకం ప్రదర్శిస్తారు. 31 తేది పెద్ద బాలశిక్ష మనిషికీ మనిషికీ మధ్య నాటక ప్రదర్శన వుంటాయి. నాటకోత్సవాలను పురస్కరించుకొని పొన్నాల రామ సుబ్బారెడ్డి, రేబాల రమణ, షేక్ నాజర్, వెంకటేశ్వర్లు, గూడూరు సావిత్రి, కె.ఎస్.టి. సాయిలను సన్మానిస్తారు. నాటక ప్రియులకు నాలుగు రోజుల పాటు లక్ష్మీ ధాన్స్, మిస్ కాకుండా టౌన్ ప్రజలను రమ్మంటున్నారు జిల్లా కలెక్టర్ గారు.

చిత్రసమీక్ష
9 పేజీ తరువాయి

420'' గా పేరుగాంచి బ్రతుకు తుంటుంది. సుందర రామయ్యను అడ్డు తొలగించు కునేందుకు అతన్ని ఒక నేరంలో ఇరికించి అన్నాజీ, చిన్నాజీలు జైలుకు పంపుతారు. జైల్లో "మిస్ 420'' గా కూతురు కనిపిస్తుంది సుందర రామమూర్తికి.

అక్కడి పోలీస్ ఆఫీసర్ సుందర రామమూర్తికి చిన్ననాటి స్నేహితుడు కావటంతో, నిజా నిజాలు తెలుసుకొని సుందర రామమూర్తిని జైలు నుంచి విడుదల చెయిస్తాడు. అన్నాజీ, చిన్నాజీలకు బుద్ధి చెప్పించి ఆ ఊరు పరిస్థితులు చక్కదిద్దే ఉద్దేశ్యంతో "మిస్ 420'' ని ఏడు రోజులు పెరోల్ మీద వదిలి పెట్టిస్తాడు. మిస్ 420 ఈ ఏడు రోజుల్లో భర్త వదిలేసిన తన అక్క సంసారాన్ని చక్క దిద్దుతుంది. దుర్మార్గుల మూలంగా పోయిన తన తండ్రి ఉద్యోగం తిరిగి వచ్చేట్టు చేస్తుంది. బాగా చితకబాది అన్నాజీ, చిన్నాజీల రాక్షస బుద్ధిని సంహరిస్తుంది. ఏడు రోజులు తర్వాత మిస్ 420 ని మరలా జైలుకు తీసుకు పోయేందుకు పోలీసులు వస్తారు. తన మంచి కార్యాలతో ప్రజల హృదయంలో స్థానం సంపాదించు కోవటంతో, ఆ ప్రజలంతా అడ్డుపడి "మిస్ 420'' కి జైలు శిక్ష రద్దు చేయిస్తారు.

"మిస్ 420'' గా అశ్వని నాచప్ప గొప్పగా నటించింది. ఫైట్సులో అయితే చెప్పనే పనిలేదు. కామెడీ కూడా బాగా పండించింది. మౌళి సుందర రామమూర్తి పాత్రలో నటించి దర్శకుడి గానే కాక మంచి నటుడుగా కూడా పేరు గాంచాడు. కోట శ్రీనివాస రావు, తనికెళ్ల భరణి ఉమ్మడి నటన అటు విలనీని, ఇటు హాస్యాన్ని అందించాయి. వీరి షాక్ ట్రీట్‌మెంటు, ఎలక్ట్రిక్ ట్రీట్‌మెంట్ నవ్విస్తాయి. బ్రహ్మానందం ఇన్‌స్పెక్టరుగా సరదాగా కనిపించాడు. రాజ్‌కుమార్, ఇంద్రజ, శ్రీహరి, పిఎల్ నారాయణ బాగా నటించారు.

ఎల్.బి. శ్రీరాం మాటలు గొప్పగా కుదిరాయి. హాస్యరసం పులుముకొని, ఛలోక్తులు విసురుకుంటూ చురుగ్గా మెరుగ్గా సాగాయి. వి. శ్రీనివాస రెడ్డి కెమెరాకు కళాంజలి ఘటించాలి. శ్రీ సంగీతానికి చెవులు అప్పగించాలి.



న్యూ అనిల్ బుక్ సెంటర్ సౌజన్యంతో నెల్లూరులో ఏర్పాటైన గ్రంథాలయాన్ని ప్రారంభిస్తున్న అప్పటి ఇన్‌ఛార్జ్ కలెక్టర్ సతీష్‌చంద్ర

సినిమా
9 పేజీ తరువాయి

పునర్నిర్మించారు. కానీ అది అనుకొన్నంత విజయం సాధించ లేదు. ఇటీవల హిందీలోకి డబ్ చేసిన మణిరత్నం రోజా, దళపతి, దొంగ దొంగ విజయం సాధించడంతో నాయకన్‌ను మళ్లీ డబ్ చేస్తున్నారు. చిత్రం కోసం కమల్ హాసన్ స్వయంగా డబ్బింగ్ చెబుతున్నారు. నాయకన్ చిత్రంలో వున్న అయిదు పాటలకు అదనంగా మరో రెండు పాటలు పెట్టనున్నారు. ఒక కథతో విడుదలైన చిత్రమే మళ్లీ విడుదల కావడం విశేషం.

అర్జున్
మొదటపేజీ తరువాయి

రెడ్డిలు ముగ్గురూ పివిని సమర్థిస్తూ, అర్జున్‌సింగ్ సస్పెన్షన్‌ను బలపరుస్తూ పత్రికా ప్రకటనలు చేశారు. పార్లమెంట్ సభ్యుడు శ్రీ కెఎస్ రావు ఒక్కడు మాత్రం తొందరపడి, సస్పెన్షన్‌కు ఒక రోజు ముందు అర్జున గీత మాలపించాడు. స్వంత రాష్ట్రంలోని కాంగ్రెస్ పార్టీ ఏకోన్ముఖంగా తనను సమర్థించడం ఈ అపర సమయంలో పివికి నైతిక బలం సమకూరుస్తున్నది. చెన్నారెడ్డి అందుకు వ్యతిరేకంగా బయట పడితే మాత్రం ఆయనకు కష్టమే. చెన్నారెడ్డి తోటి ఎందరు రాష్ట్ర కాంగ్రెస్ వాదులు తనను వ్యతిరేకిస్తారనే లెక్కలకంటే నైతికంగా ఆయన ఇబ్బందులు ఎదుర్కో వలసి వుంటుంది.

ఖాళీ ఖజానా
మొదటపేజీ తరువాయి

రాక్ వంటి శాఖలలో పనులు ఆగిపోయాయి. చేసిన పనులకు కాంట్రాక్టర్లకు డబ్బు చెల్లించే పరిస్థితి లేదు. అర్జంటుగా ఏదో ఒకటి చేసి నిధులు సేకరించకుంటే ప్రభుత్వం స్తంభించి పోతుంది. మార్చి, ఏప్రెల్ తర్వాత సబ్సిడీ బియ్యం పథకమూ అనుమానమే. ఆ విషమ పరిస్థితిని తప్పించడానికి ఏమి చెయాలో బోధ పడడం లేదు. ప్రభుత్వ స్థలాలు అమ్మి ఖజానాకు పైసలు జమ చేయాలన్న నిర్ణయం తీసుకున్నా రంటేనే ఎటువంటి విపత్కర స్థితిలో వున్నదీ అర్థం చేసుకోవచ్చు. అయిన కాడికి ఆస్తులు తెగనమ్మి వున్నదంతా వూడ్చి పెట్టి సంసారాన్ని పోషించాల్సిన దుర్గతిలో వున్న కుటుంబ పెద్ద వలె ఇబ్బంది పడిపోతున్నారు ఎన్టీఆర్.

ఇంకొక ప్రక్క మతిమరుపు ఆయనకు పెద్ద బాధగా వుంది. ఇప్పుడు చెప్పిన విషయం గంట తర్వాత మర్చి పోతున్నారు. ఒక్కొక్కసారి ఫైల్ల పై సంతకాలు పెట్టిన సంగతి మర్చి పోతున్నారు. ఈ మతిమరుపు వల్ల ప్రభుత్వ నిర్వహణలో చాలా సమస్యలు తలెత్తుతున్నాయి. అధికారులు ఇరకాటంలో పడిపోతున్నారు.

50 ఏళ్లక్రితం
3 వపేజీ తరువాయి

జిల్లా టెక్స్‌టైల్ ఆఫీసరు వీరన్నాచారి గారు చాలా మంచి వారు, స్ట్రిక్టు ఆఫీసరు. మడమనూరు వారు తన్ను సన్మానించి వెండి కాస్కెట్ బహూకరిస్తే ప్రభుత్వానుమతి లేనిదే నేను తీసుకోనల్లా! అని తిరస్కరించారు గూడ. సింపిలిసిటీ, అధికార గర్వం లేక అందరితో కలిసి మెలిసి నమ్రతతో తనపనికి లోటు లేకుండా వుంటారు. యివన్నీ సరే, జిల్లాలో బ్లాక్ మార్కెట్టున్నదనీ, ఇతర విమర్శలు వస్తే వాటికి ఉలికి పడితే ఎట్లా? వాటిని రూపు మాపడానికి తానూ, పబ్లికు ప్రయత్నించాలి గాని విచార పడితే లాభమేమి? తన లోటు ఏ మాత్రం లేదనేది ముమ్మాటికి నిజం. యితర జిల్లాల కంటే యీ జిల్లా ఎంతో మేలు గూడా. తన పాలనలో యింకా లోటు పాట్లు ఏమున్నావా అని వాంఛించాలె గాని జనరల్ విమర్శలకు ఉలికి పడితే లాభం లేదు సుమా!

# వెకిలి చేష్టల వికారం: పోకిరిరాజా

హిందీలో విజయ వంతమైన ఆంఖే చిత్రాన్ని తెలుగులో పోకిరిరాజాగా తీసి జన రంజకం చేయడంలో దర్శకుడు కోదండ రామిరెడ్డి విఫల మయ్యాడు.

మాతృకలో హాస్య ప్రధానంగా సాగే కథకు తెలుగులో తీసిన సన్నివేశాలు, పొంతన కుదరక అపహాస్యం పాలయ్యాయి. ప్రథమార్థ మంతా సాగదీసిన వెకిలి చేష్టలతోనే సరిపోయింది. తరువాత కథ కూడా ప్రేక్షకుల చెవుల్లో పువ్వులు పెట్టి నడిపారు. రాష్ట్ర ముఖ్యమంత్రిపై ఒకసారి హత్యా యత్నం జరిగాక సాధారణంగా సెక్యూరిటీ టైట్‌గా వుంటుంది. అటువంటప్పుడు సిఎం.ను కిడ్నాప్ చేయాలనుకొనే ముఠా, గాయపడి హాస్పిటల్‌లో చికిత్స పొందుతుంటే సిఎం సెక్యూరిటీ ఆఫీసర్‌ను చంపి వేస్తే, దానిపై విచారణ వుండదు. సైడ్ హీరో సిఎం హత్యకు కుట్ర జరుగుతుందని చెప్పి ఆ స్థలాన్ని చూపిస్తే, అక్కడ విలన్ మనిషి మారు వేషంలో వుండి కాకమ్మ కబుర్లు చెబితే ఖాకీలు గంగిరెద్దుల్లా తలూపుకుంటూ వచ్చేస్తారు. కనీసం ఆమెను అదుపు లోనికి తీసుకొని ప్రశ్నించరా చెప్పండి ? హత్యా నేరంలో ఇరుక్కొని వున్న సైడ్ హీరోను మరో పోలీసు అధికారి కారులో కూర్చొన పెట్టుకొని తిరుగుతాడు. అదే విధంగా అజ్ఞాతంలో వున్న హీరో చివర్లో కరెక్టుగా సిఎంను దాచిన ప్రదేశంలో ప్రత్యక్ష మవడం సాంఘిక చిత్రాల్లో సాధ్యమవుతుందా? కోదండ రామిరెడ్డికి తాను తెరపై కనపడాలన్న కోరిక మనసులో వుండింది కాబోలు. ట్రైన్‌లో హీరో భుజంపై కునుకు తీస్తూ చిత్రంలో కనిపిస్తాడు. నెల్లూరీయుడైన దర్శకుడు ఒక క్యారక్టర్ ద్వారా నెల్లూరీయులు మాట్లాడే తీరును మరీ కించ పరచడం తగదు.

ఇక కథ లోనికి వెళితే చంటి ( వెంకటేష్), నాని (అలీ) అల్లరి చిల్లరిగా తిరిగే బావ - బావమరుదులు. వీరి అల్లరికి ఒక హద్దంటూ వుండదు. అందువల్లే చంటి తండ్రి ఆనంద నాయుడు ( సత్యనారాయణ) విసిగి వేసారిపోయి, ఇంట్లో నుండి తరిమేస్తారు. ఆ రోజే కారు క్రింద పడబోయిన రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రేమ్ చంద్ ( శరత్‌బాబు) కొడుకును చంటి, నానీలు కాపాడుతారు. దీనివల్ల సిఎంతో కలుసుకొని మాట్లాడే అవకాశం వీరికి దొరుకుతుంది. వీరిద్దరూ సిఎం నివాసంలో వున్నప్పుడే విక్కీ ( మోహన్‌రాజ్) ముఠా సిఎం కుటుంబ సభ్యులను అంత మొందిస్తుంది. వీరి వెంట పడిన చంటి, నానీలకు - చిట్‌ఫండ్‌ల కుంభకోణంలో శిక్ష పడిన అశోక్ కుమార్‌ను రక్షించేందు కోసం సిఎంను హతమార్చి, సిఎంను పోలిన వ్యక్తి బ్రహ్మంను ( మరో శరత్‌బాబు) ప్రవేశ పెట్టాలనుకొనే విలన్ పథకం వింటారు. ఈవిషయం పోలీసులకు చెప్పను వెళుతుండగా చంటి ఆ ముఠా చేతిలో పట్టుబడి పోతాడు. నానీ విలన్ల కుట్రను పలువురికి చెప్పినా అల్లరి చిల్లరి మాటలని ఎవరూ నమ్మరు. దీనికి తోడుగా నానీపై చంటి హత్యానేరం ఆపాదించ బడడంతో అతను చాటుమాటుగా తిరుగుతుంటారు.

ఈ దశలో పల్లెటూరి నుంచి బాలరాజ్ ( మరో వెంకటేష్) పట్న వాసం రావడం, పలువురు చంటి అనుకొని అతని వెంట పడడంతో విలన్ల తోపాటు ప్రేక్షకులూ గందరగోళ పడిపోతారు. చివరన చంటి, నానీ, బాలరాజ్ కలసి విమానా శ్రయంలో వీరోచితంగా పోరాడి, సిఎంను రక్షించి బుద్ధిమంతులని బిరుదులు తెచ్చు కోవడంతో చిత్రం ముగుస్తుంది.

## చిత్రసమీక్ష

అల్లూరు రహీం

చిత్రంలో వెంకటేష్, శరత్‌బాబు, సత్యనారాయణ ద్విపాత్రాభినయంలో కనపడతారు. ముగ్గురు హీరోయిన్లు ప్రతిభా సిన్హా, రోజా, శుభశ్రీ పాటల వరకే పరిమితం. వెటరెన్ డ్యాన్సర్ జ్యోతి లక్ష్మి పోషించిన కన్యా కుమారి పాత్ర, తనికెళ్ల భరణి ప్రేమ పాత్రల్లో కృతి మించని శృంగార ముంది. వేటూరి, సీతారామ శాస్త్రి, జొన్న విత్తుల రాసిన పాటల్లో ఎర్రతోలు పిల్లా, గంప క్రింద కోడిపెట్ట, కలగా వచ్చినావు పాటలు వినసొంపుగా వున్నాయి. కానీ పలు హిందీ బాణీలను రాజ్ - కోటిలు తెలివిగా కాపీ కొట్టేశారు. కొత్త కెమెరా మెన్ ప్రతాప్ మంచి ప్రతిభ చూపాడు. పరుచూరి బ్రదర్స్ మాటలు చెప్పుకో తగ్గ స్థాయిలో లేవు. పేరు గొప్ప ఊరు దిబ్బ చందాన భారీ నటవర్గమే గాని చెప్పుకో తగ్గ నటన ప్రదర్శించని, ప్రేక్షకులకు కాసింత వినోద మివ్వని సాదా సీదా చిత్రం పోకిరిరాజా.

## జిల్లావార్తలు

5వ పేజీ కొరవ

ఎక్స్‌ప్రెస్ ధార్జీల కన్నా రెండు రూపాయలు అదనంగా వసూలు చేయడం ఆర్టీసి అధికారుల దోపిడీకి నిదర్శనం. ఫాస్ట్ పాసింజర్ అయిన ఆక్సిని సర్వీసులో అదనపు ఛార్జిని తగ్గించేందుకు ఉన్నతాధికార్లు చర్యలు తీసుకోవాలి.

### పులికాట్‌లో పర్యావరణకు ముప్పు!

నెల్లూరు జిల్లా స్వచ్ఛంద సేవా సంస్థల సమాఖ్య (నావా), మద్రాస్ తీర ప్రాంత మత్స్య కారుల అభివృద్ధి కార్యాచరణ సమితి సంయుక్తంగా పులికాట్ ప్రాంత పర్యావరణ పరిరక్షణపై ఒక సదస్సు నిర్వహించాయి. 23 తేది హోటల్ కిషంలో ఆనాటికి ఇన్‌ఛార్జి కలెక్టర్ సతీష్ చంద్ర సదస్సు ప్రారంభించి మాట్లాడారు. పులికాట్ సరస్సు ఆనుకొని వున్న గ్రామాల్లో లైట్లను వేసి రోడ్లను నిర్మిస్తే శీతాకాలంలో వలస వచ్చే వేలాది పక్షులకు ఆటంకం ఏర్పడి రావడం మానేస్తాయని సూచించిన పరిశోధకులు ప్రస్తుతం రొయ్యల సాగుకు, పరిశ్రమల స్థాపనకు అనువుగా వుంటుందని చెప్పడం పట్ల ఆశ్చర్యాన్ని వెలిబుచ్చారు. మద్రాస్‌కు చెందిన శాస్త్రవేత్త డాక్టర్ ఏ.జె. సంజీవ రాజ్ ప్రధానోపన్యాసంలో తాను గత 10 సంవత్సరాలుగా పులికాట్ ప్రాంత పర్యావరణంపై పరిశోధన చేస్తున్నట్లు చెప్పారు. ఇప్పటికే ఈ ప్రాంతంలో కాలుష్యం అలుము కుంటున్నదని చెప్పేందుకు ఈ సంవత్సరం వందల సంఖ్యలో మాత్రమే వచ్చిన పక్షులు ప్రత్యక్ష సాక్ష్య మన్నారాయన. సదస్సుకు ఆచార్య పిసి రెడ్డి మోడరేటరుగా వ్యవహరించారు. జిల్లా పర్యావరణ కమిటి సభ్యురు ఐవిఎస్ నాయుడు కార్యక్రమానికి అధ్యక్షత వహించారు. డాక్టర్ ఫెలిక్స్ సుగిర్త రాజ్, సంస్థ కో - ఆర్డినేటర్ శివ శేకప్పలు మాట్లాడారు. జిల్లాలో దాదాపు 25 స్వచ్ఛంద సంస్థలు సదస్సులో పాల్గొన్నాయి. బదిలీపై వెళుతున్న సతీష్ చంద్రను శాలువ కప్పి ఘనంగా సన్మానించి ఆయన సేవలను కొనియాడారు.

### బ్యాడ్మింటన్ సంయుక్త కార్యదర్శి మనోహర్!

పొదలకూరు ఎసి సుబ్బారెడ్డి మెమోరియల్ రీడింగ్ రూమ్ మరియు యూత్ సెంటర్ కార్యదర్శి తోట మనోహర్ రాష్ట్ర బాల్ బాడ్మింటన్ అసోసియేషన్ సంయుక్త కార్యదర్శిగా ఎన్నికయ్యారు. ఇటీవల కర్నూల్‌లో రాష్ట్ర సంఘ సర్వసభ్య సమావేశం జరిగింది. విద్యార్థి దశ నుంచే మనోహర్‌కు బ్యాడ్మింటన్ ఆటంటే ప్రాణం. 74 నుండి 80 వరకు వివిధ రాష్ట్ర స్థాయి పోటీల్లో పాల్గొని గుర్తింపు తెచ్చుకొన్నారు. 1989, 94 రాష్ట్ర బాడ్మింటన్ మహిళా జట్టు, సబ్ జూనియర్స్ బాల బాలికల జట్టుకు మేనేజరుగా వ్యవహరించారు. 90 నుంచి నెల్లూరు జిల్లా బ్యాడ్మింటన్ అసోసియేషన్ సంయుక్త కార్యదర్శిగా, 94 నుంచి జిల్లా సెలక్షన్ కమిటీ కన్వీనర్‌గా కొనసాగు తున్నారు. పొదలకూరులో శ్రద్ధతో బాల బాలికలు క్రీడలు ఎదిగేందుకు ఎసిఎస్ యూత్ సెంటర్ నెలకొల్పి ఎంతో కృషి చేస్తున్న మనోహర్ మరింత పైకెదగాలని కోరుకుందాం.

### అధ్వాన్న స్థితిలో రాపూరు ఆర్టీసి డిపో రోడ్డు

గ్రామీణ ప్రాంతాలకు రోడ్లు సరిగా వుంటేనే బస్సు సర్వీసులు నడుపుతామని ఆర్టీసి అధికారులు బడాయిలు పలుకు తుంటారు గానీ, తమ కళ్ల ముందున్న బస్టాండ్‌లోకి వెళ్లే రోడ్డు యేళ్ల తరబడి ఛండాలంగా వుంటే గమ్మున చూస్తూ ఊరకొంటున్నారు. రాపూరు ఆర్టీసి బస్ స్టేషన్ లోకి వెళ్లాలంటే ఫర్లాంగు దూరం మెటల్ అప్రోచ్ రోడ్డు మీద వెళ్లాలి. గత నాలుగేళ్లుగా ఆర్టీసి ఈ రోడ్డును పట్టించుకోక పోవడం వల్ల గుంటలు, మిట్టలతో వర్ణించలేని స్థితికి చేరుకొంది. ఈ రోడ్డు అందువల్లే బస్టాండ్ లోకి బస్సు పోతున్నా రోడ్డు విషయం తెలిసిన ప్రయాణికులు మాత్రం గేటు వద్ద బస్సు దిగి తిరిగి వెలుపలికి వచ్చే సమయంలో ఎక్కుతారు. రోడ్డు సంగతి తెలియని దూర ప్రయాణికులు క్రిందా మీద పడి బస్సు కమ్మీలు గుచ్చుకొని గాయపడి చికిత్స పొందిన సందర్భాలు ఎన్నో వున్నాయి. డిపో మేనేజర్ సంస్థ లాభాల పై మాత్రమే దృష్టి పెట్టక ప్రజా సంక్షేమం కూడా కాసింత ఆలోచించాలి. లేకుంటే ఎవరో ఒకరు వినియోగ దారుల ఫోరంను ఆశ్రయించక తప్పదు.

### అల్లూరు పశువైద్య శిబిరం

అల్లూరు పశు వైద్యశాలలో 20 తేది వైద్య శిబిరం జరిగింది. ఎదకు రాని, తిరగ కట్టే పశువులకు గర్భకోశ వ్యాధి, మందగొడ్డి, జలగ వ్యాధి, ఇతర వ్యాధులు గల 200 పశువులను వుచితంగా పరీక్షించారు. అవసరమైన వాటికి వుచితంగా ఆపరేషన్లు చేశారు. పశు సంవర్ధక శాఖ సంయుక్త సంచాలకులు ఎస్. రామ లింగరాజు, ఎడి వెంకట రెడ్డి, డాక్టర్లు సుబ్బయ్య, ఎన్. ప్రభాకర రెడ్డి, మురళీ కృష్ణ కార్యక్రమంలో పాల్గొన్నారు. శిబిరాన్ని ప్రారంభించిన రామలింగ రాజు మాట్లాడుతూ పశువులకు యూరియా వేసిన గడ్డి వాడితే పాల శాతం పెరుగు తుందన్నారు. ఎప్పుడు పడితే అప్పుడు పాలు తీసే విధానం వల్ల పాలశాతం తగ్గుతుందని చెప్పారు. కార్యక్రమంలో సిండికెట్ బ్యాంక్ ఫీల్డ్ ఆఫీసర్ నరసింహులు రెడ్డి కూడా పాల్గొన్నారు.

### వెంకటగిరిలో స్పెషలాఫీసర్లు

వెంకటగిరి, డక్కిలి, బాలాయ పల్లి మండలాల్లోని సింగిల్ విండోల అధ్యక్షుల పదవీ కాలం పూర్తయి పోవడంతో వారి స్థానంలో స్పెషలాఫీసర్లను నియమిస్తూ కలెక్టర్ ఉత్తర్వులు జారీ చేశారు. వెంకటగిరి, జయంపు, లింగ సముద్రం, బాలాపేట, నిడిగల్లు సింగిల్ విండోలకు కోఆపరేటివ్ సబ్ రిజిష్టార్ ఎన్.వెంకటయ్య ప్రత్యే కాధికారిగా వ్యవహరిస్తారు. యాచవరం, అల్లూరుపాడు, గుండ్ల సముద్రంలకు వెంకటగిరి మండల కోఆపరేటివ్ అభివృద్ధి అధికారి ఎన్.బాషా, దగ్గవోలు, భైరవరం, మదవాయ పాళెం విండోలకు స్టేట్ బ్యాంక్ అధికారి జి.ఆదిశేషయ్యలను నియమించారు. డక్కిలి సొసైటీకి ఎమ్మార్వో నరసింహులు, బాలాయపల్లి సొసైటీకి ఎమ్మార్వో సుధాకర్ స్పెషల్ ఆఫీసర్లుగా నియమితు లైనట్లు గూడూరు డివిజన్ సహకార అధికారి ఎల్.మధు సూదన రావు చెప్పారు.

### నోట్ల రద్దు

2 పేజీ కొరవ

పై పెచ్చు ద్రవ్యోల్బణం వల్ల ధరలు పెరిగి పోవడంతో చిన్ననోట్ల అవసరం ప్రజలకు పెద్దగా వుండడం లేదన్నది ఆయన అభిప్రాయం. లండన్‌లో కూడా ఒక్క పౌండ్ నోటును ఎవరూ వాడరట.

రూపాయి విలువ ఎంత గొప్పగా వుందో ఈ నిర్ణయం తెలియ జేస్తున్నది!



Edited, Printed and Published by N. Dalendra Prasad at Zaminryot Press. OFFSE[T] ... at Nayagara Paper Products (India) Ltd